# విశ్వదాత

రచయిత:
'ఉభయభాషాప్రవీణ'
కందాళ వేంకట నరసింహాచార్యులు,
ఆంధ్రాధ్యాపకుఁడు, స్టాన్లె బాలికోన్నత పాఠశాల, హైదరాబాదు (దక్షిణ)

వెల ఐ. జి. రూ. 0-14-0.

# ఈ రచన

నేటిపిన్నలె రేపటిపెద్దలు; భావిపౌరులు. భాషాభివృద్ధి జాతీయ వికాసమున కొక గొప్పచిహ్నము. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" — మున్ను తెలుఁగురాయఁడనిన సూక్తిని సార్థకముచేయుటకుఁ బ్రతితరమువారును యత్నించుట విధి. ఆ విధిని నిర్వర్తింప వలెనన్నను, పై రాయలసూక్తిని యథార్థమని ఋజువుచేయవలెననినను, భావిపౌరులుకాఁదగు నేటి బాలబాలికలకు తెనుఁగుఁదనము నెఱుకపడఁ జేయవలెననినను పలుతెఱఁగుల రచనలు కావలసియేయున్నవి.

ఈ నా రచనకీ క్రింది విషయములు మూలములు —

1. భాషామాతృసేవ.
2. రసవత్తరములును, నీతిబోధకములును, ఆదర్శకములునగు విషయములను కథారూపమున విద్యార్థిలోకమున కందించుట.
3. కాళిదాస మహాకవి కావ్యములోని కథావస్తువు మూలమున నాతని రచనలోని యలంకారవైఖరిని విద్యార్థుల దృష్టికిఁ గొనితెచ్చుట.

ఇవి మనసుననిల్చి యీ పొత్తమును రచింపజేసినవి. నా యీరచనకు కాళిదాసుని 'రఘువంశమహాకావ్యము' లోని 2, 3, 4, 5 సర్గములందలి కథయే మాతృక. ఇందలి

కథయు, భావములు, నలంకారవైఖరియుఁ గాళిదాసునివి. భాషయు నచ్చటచ్చటఁగొన్ని వర్ణనములును నావి.

సాధ్యమయినంతవఱకు నున్నతకక్ష్యల విద్యార్థుల కుపయుక్తమగు శైలిక్రై యత్నించితిని. దాని సాఫల్యమును గూర్చి విజ్ఞులెఱుఁగఁగలరు. సులభసంధులను గావలెనని వాడితిని; ఉచితమనితోఁచిన తావుల సంధులను వదలితిని.

కేవలము భాషాజ్ఞానము గఱపుటయెకాక పూర్వ రాజన్యుల సత్ప్రివర్తనములును, గురుశిష్యుల నడుమఁగల సంబంధములును, రాజుల దాననిరతియు, విద్వాంసులయెడఁ గల యభిమానమును నిండలి దిలీప-రఘు-వసిష్ఠ-వరతంతు-కౌత్సుల గాథల మూలమున నెఱుకచేయుటయు నా యాశయము.

హైదరాబాదు,
ఖర సం॥ పుష్యము
జనవరి, 1952.

ఇట్లు,
విధేయుఁడు,
రచయిత.

# విషయసూచిక

## పూర్వఖండము

### ప్రథమ ప్రకరణము



### ద్వితీయ ప్రకరణము



### తృతీయ ప్రకరణము



### చతుర్థ ప్రకరణము



### పంచమ ప్రకరణము

## షష్ఠ ప్రకరణము



# ఉత్తర ఖండము

## ప్రథమ ప్రకరణము



## ద్వితీయ ప్రకరణము



## తృతీయ ప్రకరణము

# ప్రథమ ప్రకరణము

## వంశావతరణము

శ్రీమంతంబగు భరతఖండమున, సకలసస్యశ్యామలమై తనరారుకోసలదేశమున, సుపవిత్ర జలప్రపూర్ణంబగు సరయువుపొంత నయోధ్యానగరాభిధానంబగు నొక్క పురవరంబు విరాజిల్లుచుండును. సుయశశ్శ్రీవిరాజమానులగు నిక్ష్వాకు వంశజు లానగరవరంబును రాజధానిగఁ జేసికొని యుత్తరకోసల విషయమున కధిపతులై సుభిక్షముగ దేశమును బాలించుచుండిరి.

ఆహా! ఆపత్తనంపు సొబఁగేమని వర్ణింపనగు! పురాభివృద్ధి శాఖవారలు తీర్చిదిద్దిరాయనునట్లు సువిశాలములై యవక్రప్రక్రియనున్న వీథులును, వీథుల కిరుకెలంకులను జంద్రమండలమును జుంబింపమోఁ అలు సారించినపగిది నిలువఁబడిన మేడలును, మేడల యొయ్యారంబునకుఁ దగిన మెఱుఁగులు దిద్దఁజాలి, తమ నెమ్మోని కాంతుల మున్మురమున నెల్లవాడల వెలిఁగింపఁజాలిన కాంతామణులును గలిగి, కుమార సమానులగు వీరకుమారులతోనిండి, స్వధర్మపరాయణులగు నెల్ల వర్ణములవారితో నాపురం బేపురంబునేని మించి యలరారుచుండును.

అట్టి యానగరవరంబు నలుకెలంకుల దట్టములగు నీడల

నలరారు తరువరంబులతో సొంపునింపు నుద్యానవనంబులు శోభిలుచుండు. నగరమునంటిపాఱు సరయూనదీతరంగ వాయువు లానగరమందలి ప్రాణిలోకంబునకెల్లఁ ప్రాణ పోషకంబులయి వీచుచుండును.

ఏ పురవరము రవికులజాతులగు రాజవరులకెల్ల రాజధానీ నగరమై విలసిల్లెనో, యే నగరరాజము శ్రీరామ చంద్రుని జనన, వాస, పాలనాదులచే వన్నెకెక్కి పుణ్య క్షేత్రముగ వాసిఁగాంచెనో, యేపట్టణరాజము మోక్షదాయక ములగు * సప్తనగరములలో మున్మొదలిదయ్యెనో యట్టి యయోధ్యానగరమున, రాచకొలమునకెల్ల మొదటివాఁడగు వైవస్వతుని వంశమున సకలసద్గుణ విరాజమానుఁడును, మహాసత్త్వుఁడునగు రఘువను శూరశిఖామణి జన్మించెను.

పాఠకులారా! యీ మన గ్రంథమునందలి కథకు నాయకుఁడగు రఘు మహారాజుయొక్క జన్మాదికములఁగూర్చి మీ రెఱిఁగియుండుట యవసరము. శ్రీరామచంద్రుని యవ తారమునకాశ్రయమగు నా పవిత్రవంశ మీ మహాపురుషుని పేరనె 'రఘువంశ'మని జగత్ప్రసిద్ధి నొందియున్నది. అట్టి యీ మహాత్ముని జన్మాదికమును, ఔన్నత్యమును నరయుదముగాక!

---

* సప్తపుణ్యక్షేత్రములు:— అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, అవంతిక, ద్వారవతి.

# దిలీప చక్రవర్తి

యుగములలో * రెండవదియగు త్రేతాయుగంబున రాజకులంబున కాద్యుఁడగు వైవస్వతమనువు వంశమున సుపవిత్రుండగు దిలీపుఁడను రాజచంద్రుఁడు, పాలకడలిలోఁ జందమామ చందమున, జన్మించెను. వీరదిలీపుఁడు వెడఁద యురముతో, నిడుపులగు బాహువులతో, క్షాత్రశక్తిం దెల్పు నెమ్మేనితో రాజిల్లుచుండెను. ఆకారమునకుఁదగిన ప్రజ్ఞయుఁ, బ్రజ్ఞకీడైన శాస్త్రజ్ఞానమును, శాస్త్రజ్ఞానమునకు సాటియగు కార్యజ్ఞతయు, కార్యవిజ్ఞానమునకు దీటగుఫలములు నామహారాజునకు సహజభూషణములై యొప్పుచుండెను. తిమితిమింగిలాది క్రూరమృగములచే భయంకరమగు రత్నాకరముపగిది నా రాజశేఖరుఁడు తన తేజము, పరాక్రమము మున్నగు భీకరగుణములచేఁ బరులకుఁ జేరరాని వాఁడైనను వాటికిఁ దోడుగనున్న శాంతము, దాక్షిణ్యము మున్నగు చల్లని గుణములచే సేవనీయుఁడు కూడ నైయుండెను.

సూర్యుఁడు తనకిరణములచే భూజలము నెల్లఁ గ్రోలి దానికి వేయిరెట్లుగ భూమికి వర్షరూపమున జలదానము సేయుఁగదా! అట్లే దిలీప సార్వభౌముఁడును ప్రజలనుండి కొలదిపన్నులను సేకరించి వానికిబ్బడిగఁ బ్రజలకెల్ల సౌకర్యములంగూర్చుచు వారిసంపదల నభివృద్ధిచేయుచుండెను. ఇఁక

---

*యుగములు 4:— 1. కృతయుగము, 2. త్రేతాయుగము, 3. ద్వాపరయుగము, 4. కలియుగము.

నామహారాజు పరిపాలన వైచిత్ర్యమేమని వర్ణింపవచ్చును! ఆతఁడు తన పాలనమున సైన్యశక్తి నెన్నఁడుపయోగించి యెఱుఁగఁడు. సైన్యమాతనికిఁ బరివారముగ మాత్రమె విలసిల్లుచుండు. నీతితోఁగూడిన స్వశక్తిని మాత్రమే యుపయోగించి యారాజేంద్రుఁడు తనకార్యములనెల్లఁ జక్కఁబెట్టుకొనుచుండెను.

ఆ నీతిపరుని యాలోచనాతంత్రము మూఁడవకంటి వానికె కాక ముక్కంటికేనియుఁ దెలియరాక నిగూఢమై యుండెను. మఱి యా రాజచంద్రుని గుణములో సాటిలేనివి. ఇతరుల రహస్యముల నెఱిఁగియు నా మహారాజు వానిని వెలువరింపఁడు. అపకారులకు శాస్తిసేయ సమర్థుఁడయ్యును నోరిమితో సహించును. దానమిచ్చియుఁ బొగడుకొనఁడు. ఇట్టెఱుఁగున జ్ఞానము – మౌనము; శక్తి–సహనము; దానము–అవికత్థనత్వము అను నీ పరస్పర విరుద్ధగుణము లాపుడమిఱేని యందొకటితో నొకటికలసి తోడఁబుట్టువులభాతి భాసిల్లుచుండు. ప్రజలకు వారితండ్రులు కేవలము కన్నకతముననె తండ్రులయిరి కాని, వారికి వినయసౌశీల్యములఁ గఱపుటయు, ఆపదలనుండి రక్షించుటయు, నన్నపానాదులనొసంగి పోషించుటయు మున్నగు కార్యములచే దిలీపుఁడే వారికిఁ దండ్రియని పేర్కొనఁదగియుండెను.

ఔషధము చేదయినను దానిని రోగి యాదరమున సేవించుఁగదా! అట్లె యా మహారాజు యోగ్యుఁడగువాఁడు

తనకెంత పగతుఁడయినను వానినాదరించుచుండెను. మానవు నకుఁ దన శరీరావయవములయెడ నెంత మమకారమున్నను పాము గఱచిన భాగమునతఁడెంత పూనికతో ఛేదింప నిచ్ఛ గించునో యట్లె దుష్టుఁడగువాఁడు తనకెంత మిత్రుడయినను వాని నా మహారాజు వెంటనే విసర్జించును.

మానవుఁడు తన జీవితమును సుఖతరముగఁ గడపి మోక్షమును సాధింప ననువగు సాధనములు మూఁడుగాఁ బూర్వమునీంద్రులచేఁ బేర్కొనఁబడినవి. అవియే ధర్మము, అర్థము, కామము అనునవి. ఈ మూఁడిటికె త్రివర్గమని పేరు. ఈ త్రివర్గమును సాధించినవాఁడె మోక్షాధికారి యగును. వయఃపరిణతిని బట్టి మానవజీవితము నాలుఁగు భాగములుగా విభజింపఁబడినది. వాటికె యాశ్రమములని పేరు. అవియె బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము ననునవి. పై త్రివర్గమును సాధించుటకీ యాశ్రమ చతుష్టయ మునందలి రెండవదియగు గృహస్థాశ్రమమె అత్యుత్తమ సాధ నము. ఈనాలుఁగాశ్రమములలో మొదటిదగు బ్రహ్మచర్యము విద్యా-తపస్సుల నార్జించుట కనుకూలము. మూఁడవదియగు వానప్రస్థము, నాల్గవదియగు సన్న్యాసమునుస్వీ కరించుటకొక యభ్యాసమువంటిది. ఇట్లు ఒకటి, మూఁడు, నాలుఁగాశ్రమ ములు మానవుని జ్ఞానార్జనమునకును, ఆత్మోన్నతికిని, మోక్ష సంపాదనమునకు నుపకరించుచున్నవి కాని మానవుఁడు తనతోడివారికెట్టి యుపకారమును గావించుటకు నవి తగిన

యవకాశ మిచ్చుటలేదు. ఇఁకఁబోఁగా రెండవదియగు గృహస్థాశ్రమమె పరోపకారము గావింప మానవుని సను కూలునిఁ జేయునట్టిది.

గృహస్థుఁడు కుంటి, గ్రుడ్డి వారలపాలిటఁబెన్నిధి. గృహ మేధి పైమూఁడాశ్రమములవారికిని కల్పతరు వెకాదె! అట్టి గృహస్థాశ్రమమున మానవున కనుకూలవతియగు పడతి యబ్బెనా యికనాగేస్తుని యదృష్ట మేమనవచ్చు! ఆ నరుని సంసారమునకంటె స్వర్గము వేఱొండుగలుగునే! ఇట్టిసర్వోత్తమ మగు గృహస్థాశ్రమమును స్వీకరించుటలో దిలీప సార్వ భౌముఁడు చక్కనిబుద్ధి నుపయోగించి తనజీవితనౌకకుఁ గర్ణధారిణియు, సుకళత్రము ననఁదగిన లలనారత్నము నుద్వాహమయ్యెను. మగధరాజవంశమున జననమందిన యా కాంతామణి 'సుదక్షిణ' యను నామాక్షరములకుఁ దగిన దాక్షిణ్యభావమున నొప్పారుచుండును. అట్టి సుదక్షిణాదేవిం జేబట్టిన యా రాజన్యుఁడు తనను సుకళత్రవంతునిగ భావించు కొని యానందించుచుండెను.

జగత్తున మానవుఁడు, తనకెన్నిసంపదలున్నను, తానెం తటి విద్యావిజ్ఞానముల నార్జించియున్నను, సకలశక్తిసంపన్నుం డయినను, వంశాభివృద్ధికై యనుఁడు, లేదా తనజీవితానంద మునకేయనుఁడు, తనయర్థాంగియందుఁ దనకనురూపుఁడగు పుత్రుఁడు కలుగవలయునని కాంక్షించుట సహజముకదా! అట్లే దిలీప చక్రవర్తియుఁ దన కనుకూలవతియగు సుదక్షిణా

దేవియందుఁ దనకనురూపుఁడగు తనయుఁడు కలుగవలయు నని కాంక్షించెను. అట్టి తనమనోరథమెన్న డీడేరునాయని యాఁతఁడు చిరకాలము ప్రతీక్షించెను. కాని యా యపేక్ష యా మహారాజున కుత్తరవయసుదనుక నల్లిమిగిలియుండెను. అట్టి యపేక్షాభారమున నాతనికి రాజ్యబంధమొక కంఠ పాశముగనయ్యెను. సంతానార్థియగు నారాజశిఖామణి తత్సా ధనమునకై యేదేనొక వ్రతము ననుష్ఠింపఁగోరి రాజ్యభార మును మంత్రులపైనిడి, సృష్టికర్తయగు ధాతనర్చించి, సపత్నీకుఁడై కులగురువగు వశిష్ఠమునీంద్రు దర్శింప నా మహా సీయుని యాశ్రమమునకుఁ బయన మయ్యెను.

ఇది మొదటి ప్రకరణము.

---

# ద్వితీయ ప్రకరణము

## రాజదంపతుల వనయాత్ర

గురుసందర్శనమునకై బయలువెడలిన యారాజదంపతులు రథముపై నేఁగుచు నా త్రోవనడుమ నెన్నియో వింతలం గాంచి యానందించిరి. ఆ ప్రయాణకాలమున సుఖస్పర్శగల మందమారుతము వారి వెనుకనుండి ముందునకువీచుచు వారి మనోరథ సాఫల్యముం దెల్పు శుభశకునమై యొప్పారెను. అడవి తెరువునఁ జనుచున్న యాదంపతులు తమమార్గమునకు సమీపములనె యూగి తమ రథముపై చూపుల సారించు లేడి జంటల చూపులఁ తో తమ తమ కన్నుల పోలికలంగాంచి యొకరి మోము నొండొకరవలోకించుకొని మురిసికొనిరి.

దారినడుమ నచ్చటచ్చట పూర్వమీ పుడమిఱేనిచే దానములఁగొన్న యగ్రహారికులగు బ్రాహ్మణులు రాజదంపతుల యాగమనము నెఱింగి వచ్చి మహారాజ దంపతుల కర్ఘ్యమునొసంగి యాశీషములనొసంగ నా సతీపతులు నమిత శీర్షముల వానిని గ్రహించి యానందించిరి. మఱికొంతదవ్వు గడచిన యా రాజదంపతులకు నచ్చటి ముదుసలిగొల్లలు *హైయంగవీనమును గొనివచ్చి కానుకవెట్టఁ బ్రీతిమెయి వారద్దాని నందుకొని యచ్చట వింతవింతలగు నడవిచెట్టుల

---

*అప్పుడుకాచిన నెయ్యి.

పేళ్లడిగి తెలిసికొనుచు వినోదించిరి. ఇట్టులానరపతి యా యా వింతలనెల్లఁ దనప్రియసతికిఁజూపు నానందమునమునిఁగి తానెంత దూరమే తెంచినదియు నెఱుఁగఁడయ్యె.

ఇత్తెఱఁగున నమ్మేదినీపతి కడుదవ్వు పయనించి సాయంతనమునఁ దనగుఱ్ఱము లలయువేళకు గురువర్యుఁడగు వశిష్ఠు నాశ్రమముచేరెను. అయ్యెడ నా యాశ్రమములోని మునులు సమీపమునఁగల యుపవనములనుండి సమిధలు, కుశలు, ఫలములు మున్నగు వానిఁగై కొని యాశ్రమమును చేరుకొనుచుండిరి. ఆశ్రమములోని పెంపుడులేళ్లు పర్ణశాలల కడ ఋషికాంతలు తమకై యొసంగు నివ్వారిధాన్యమును మెసవ గుములుగూడి వారికడఁ జేరుకొనుచుండెను. ఆశ్రమములోని కన్నెమిన్నలు గున్నచెట్టులకు నీళ్లుపోసి యాచెట్ల కుదుళ్లలోని జలమును త్రావవచ్చు పక్షులకాటంకము గలుగ కుండుటకై యీావలకే తెంచి నిలుచుచుండిరి.

## వసిష్ఠ సందర్శనము

ఇట్టి యాశ్రమమునఁ బ్రవేశించిన యా రాజు రథము నుండి దేవేరినిదింపి, తానునుదిగి, గుఱ్ఱముల యలసటదీర్ప సారథికానతిచ్చెను. అంతట, సభ్యులును, జితేంద్రియులునగు నచ్చటి మునులు రాజునకు, నాతనిసతికి నుచితమర్యాదలఁ గావించిరి. పిదప నా మహీపతి, గురుశేఖరుఁడగు వశిష్ఠుని యనుష్ఠానమెల్లఁ దీఱుదనుక వేచియుండి, పిమ్మట, స్వాహా

దేవితోఁగూడి దేదీప్యమానుఁడై యుండు నగ్నిహోత్రునివలె ధర్మపత్నియగు నరుంధతితో నాసీనుఁడై యున్న వశిష్ఠమునిని దర్శించెను. గురుదంపతులఁ గాంచినంతనె యా రాజ దంపతులు వారిపాదములఁదాకి భక్తియుక్తులై ప్రణమిల్లిరి. గురుదంపతులును వారినిఁ బ్రీతితో నాశీర్వదించిరి.

పథశ్రమము నొందిన యా రాజదంపతులు కొంత సేపటికి సేదదేఱియున్న తఱిఁ వశిష్ఠముని రాజమహాళిం గాంచి కమ్మనిపలుకుల నిట్లనియె—"రాజచంద్రా! నీరాజ్య మునఁ గుశలమా? ప్రజలు నీ కనుకూలురై సకలసంపదలఁ దులఁదూగుచుందురే? బ్రాహ్మణాది వర్ణములవారు తమ తమ ధర్మముల నెఱపుదురుగదా!" యన నా నరపతి తన యభీష్టమును దెల్పఁదగిన సమయమిది యని తలంచి గురున కిట్లు విన్నవింపఁబోడఁగెను—

"తండ్రీ! తమ దయావిశేషంబున నాకెందునను గొఱంత లేదు. దైవికములగు కఱవులు మున్నగు చెఱుపులకును, మానవాపతితములగు చౌర్యమున్నగు నాపదలకును ప్రాయశ్చిత్తముగావించు తమసాహాయ్యమున నాకు [1]రాజ్యాంగముల నేఁడింటను కుశలమేయగును. యథావిధిగఁ దాము వ్రేల్చు నాహుతులమూలమునఁ గల్గువానలచేఁ బైరులకుఁ గీడుగలుగక యున్నది. నా ప్రజలు భయరహితులై [2]యీతిబాధలు లేక

1. సప్తరాజ్యాంగములు :— ప్రభువు; మంత్రి; స్నేహితుడు; కోశము; రాష్ట్రము; దుర్గము; సైన్యము.

2. ఈతిబాధలు:—అతివృష్టి; అనావృష్టి; ఎలుకలు; చిలుకలు; మిడుతలు; పరరాజులదాడి.

నూతేండ్లు బ్రతుకుటకు మీ తపశ్శక్తియె కారణమని విన్న వింటిని. బ్రహ్మ పుత్త్రులరగు తాము గురువులై మముం గాచుచుండ మా కాపదలెట్లు? సంపదల కేమిలోపము? కాని [3]సప్త ద్వీపావృతమగు నీ వసుంధర సర్వరత్నముల నీను చున్నను, మీ కోడలగు నీ సుదక్షిణయందు నాకుఁదగిన పుత్ర రత్నము లభింపకుండుట విచారకారణమై యున్నది. నా పితృ దేవతలు నా వెనకఁ దమకుఁ బిండమిడువారు లేరని దురపిల్లి నా చేయు శ్రాద్ధములఁ దృప్తిగా భుజింపరు. నేను పలుజన్న ములఁజేసి పరిశుద్ధుఁడనై యుండియు సంతతి శూన్యత చేఁ గళాహీనుఁడనై యున్నాఁడను.

"యజ్ఞదానాది పుణ్యకార్యములచేఁ బరలోకసుఖము మాత్ర మావహిల్లుఁగాని సద్వంశజాతుఁడగు నుత్తమపుత్రుని వలన నిహపరముల రెంటను సుఖము చేకూరుఁగాదె! ఓ దయామయా! సంతానహీనుఁడనగు నన్నుఁగాంచినఁ దమకు జాలి గలుగదే! పూజ్యుఁడా! పుత్త్రోత్పత్తిచేఁ దీర్పఁదగిన పితౄణమును దీర్పలేమిచేఁ గలిగిన దుఃఖము నన్నుఁ బీడించు చున్నది. కావున నో తండ్రీ! యీ పితౄణమును దీర్పఁ గలుగు నుపాయమును దామె యోచింపఁదగుదురు. ఆది నుండియు నిక్ష్వాకు కులమున కసాధ్యములగు నెల్లకార్యములను సాధించు దయామయులు తామె కాదె!"

---

3. సప్తద్వీపములు: - జంబూ; ప్లక్ష; కుశ; క్రౌంచ; శాక; శాల్మలి; పుష్కరములు.

## సంతానహీనతకుఁ గారణము

అని యిట్లు సార్వభౌముఁడు మునీంద్రుని మనసు కలుగ మనవిసేయ నామునికులతిలకుఁడు నిమిషమాత్రము నిమీలిత నేత్రుఁడై చేపలునిద్రించు మడుగువలె నిశ్చలుఁడై యుండెను. పిదప నా ముని దిలీపుని సంతానహీనతకుఁగల కారణమును యోగదృష్టిని లెస్సగ నారసి యాతేని కిట్లు తెలిపెను—"రాజా! మున్నొకప్పుడు నీ వింద్రలోకమున కేఁగి యుంటివి. అట నింద్రుని సేవించి మఱలఁదిరిగి వచ్చునెడ నీ తెరవునడుమ నొక్కచక్కిఁ గల్పతరువు నీడ నెమరువెట్టుచు విశ్రమించియున్న కామధేనువును గాంచితివి. అట్లు దానిం జూచియుఁ బ్రదక్షిణాదులచే దానిని గౌరవింపకయె తొలఁగి పోయితివి. అంత నా వేలుపుమొదవు నీ యలక్ష్యతనుగాంచి 'ఓయీ! నీవు నన్నిపుడు గాంచియుఁ దిరస్కరించితివి కావున నా సంతతిని పూజింపనిదే నీకు సంతతి కలుగ'దని నిన్ను శపియించెను. అట్టితఱి నత్తావున ముమ్మరముగఁ బాఱు మిన్నేటి రొదలలో, మదపుటేనుఁగులుసేయు ఘీంకారశబ్దములలో నా సురభిశాపము నీకుఁగాని, నీ సారథికిఁగాని వినరాదయ్యెను. కామధేనువు నట్లవమానించినందున నీ మనోరథము భగ్నమయినది. అదియట్టిద! పూజార్హులను పూజింపకుండుట శ్రేయోభివృద్ధికి భంజకము గాదె!"

"అది యటుండనిమ్ము. చేసినతప్పు కాఁచుకొనుటకై

యమ్మొదవు నర్థించుటయుఁ బ్రస్తుత మసాధ్యము సుమా ! ఏలయందువా ? ఆ వేల్పుటావు, పాతాళమున వరుణుఁడొనరించు దీర్ఘయాగమున హవిఃపదార్థముల సంతరించుటకై యిపుడట కేగియున్నది. పాతాళద్వారమును మహాసర్పము లరికట్టి యుండుటచే నచ్చట కేఁగను వలనుపడదు. కనుక నీవు పవిత్రమనస్కుఁడవై, సతితోడఁ గూడి యా కామధేనువునకు మాఱుగ దానిపుత్రికయగు నందినీధేనువును బూజింతివేని యదియె నీవాంఛ నీడేర్పఁజాలును.'' అని వసిష్ఠముని పలుకుచుండఁగనె వారి హోమధేనువగు నందిని తటాలున నట కేతెంచినది.

## గో సే వా వ్ర త ము

నొసట నించుక వంకరయగు తెల్లనిబట్ట; చిగురుటాకువలె నించుక కావిరంగుదాలుదో సొంపగునెమ్మేను. ఇట్టి ముద్దురూపున నామొదవు నెలవంకఁ దాల్చిన సంధ్యాదేవతవోలె శోభిలుచుండెను. కడవపొదుగుగల నాగోవునకు దూడను జూచినంతనే చేపినపొదుగునుండి జాలువారు పుణ్యదుగ్ధములచేఁ గ్రిందినేల తడియుచుండెను. శకునము నెఱిఁగిన వసిష్ఠముని తాము తలఁచుచుండఁగనె శుభప్రదగా నేతెంచిన యా నందినీధేనువుంగాంచి యా శకునముచే రాజుకోరికను నెఱవేఱుదానినిగ భావించి మానవనాథున కిట్లనియె—

"భూపతీ! నీవాంఛ శీఘ్రమె నెఱవేఱనున్నది.

మంగళరూపయగు నీనందిని మనమనుకొను చుండఁగనే
యే తెంచుట యిందులకుఁ దార్కాణము. అభ్యాసబలమునఁ
దేటయగు విద్యయలవడు విధమున వన్యములగు ఫలమూలా
దులనె భుజించుచు దీనివెన్నంటియుండి యతిభక్తితో
సేవింతువేని యీ గోవు నీయెడఁ బ్రసన్నయగు. దీనినారా
ధించు క్రమము నెఱిఁగింతు వినుము. ఇది నడిచెనా నీవును
నడువుము; నిలిచెనా నిలువుము; కూర్చుండినఁ గూర్చుండుము;
అది నీళ్లుద్రావిన నీవును నీరముగ్రోలుము. నీతోఁబాటుగ
నీధర్మపత్నియు నియమవతియై ప్రాతఃకాలమున నీనందినిని
గంధమాల్యాదులఁ బూజించి తపోవన సీమదనుక సాగనంప
వలయును. సాయంతనమున మఱల నెదురేఁగి తోడితేవలయు.
ఇట్లే నందిని కనుగ్రహము కలుగుదనుక నాసక్తితో సేవ
సేయుము. నీకు విఘ్నముఁ గలుగకుండుఁగాక! నీ తండ్రివలె
నీవును సత్పుత్త్రివంతుఁడవగుదువుగాక!'' యని యారాజు
నామునిరాజాశీర్వదించెను. దేశ, కాలముల మహిమను
లెస్సగ నెఱిఁగిన యా నరేంద్రుఁడు మునీంద్రుని యుపదేశము
విని సంతోషించి యా వ్రతము నట్లే కావింతుమని యంగీక
రించెను. గురుని యాదేశమున నారాజదంపతులారేయి
యచ్చటనే నిదురించిరి.

వ్రతములనాచరింపఁ జేయుటెఱిఁగిన యా బ్రహ్మర్షి
తన తపోమహిమచే నారాజదంపతులకు వలయు రాజభోగముల
నెల్ల నాయాశ్రమమునఁ గలిగింపఁజాలిన వాఁడయ్యు నాటి

నుండియే యాత్రవతము నాచరింపఁజేయు తలంపున నారాజునకు వన్యఫలముల తోడనె భోజనమును, కుశలతోడనె శయన మును సమకూర్చెను.

దిలీప నృపతియుఁ దనకై వసిష్ఠులేర్పరచిన పర్ణకుటీర మున, నియమవంతుఁడై భార్యాసహితుఁడై యారాత్రిదర్భ శయనముననె కడపి వఱువాత మునిశిష్యులు సేయు వేదగాన ములతో మేల్కాంచెను.

ఇది రెండవ ప్రకరణము.



# తృతీయ ప్రకరణము

## వ్రతాచరణము

మునికుమారుల వేదగానముచే మేల్కాంచిన నరపతి దిలీపుఁడు గంధద్రవ్యముల తోడను, పూవుదండల తోడను సతిచే ధేనువును బూజింపఁజేసి, దూడను బాలు గుడిపించి కట్టివైచి, ధేనువు నడవికిఁబోవిడిచెను. పతివ్రతాతిలకమగు సుదక్షిణాదేవియు నాగోవు గిట్టలతాకిడిచేఁ బవిత్రమయిన యామార్గమున నందిని ననుసరించెను. కొంతదవ్వేగిన పిదప నా నరేశుఁడు దయతోఁ దనప్రియకాంతను వెనుకకు మఱలించి యతిశ్రద్ధా భక్తులతో నా నందినింగాపాడుచు వెన్నంటిపోయెను. వ్రతనిష్ఠతో నావునకు గాపరియైయున్న యా నేలఱేఁడు తన కడనున్న తక్కిన యనుచరవర్గముం గూడఁ దనతోరానీక వెనుకకు మఱలించెను. ఏలయన, మనువంశజులు తమబలముననె తమ్ముఁదాము కాపాడుకొను వారుగదా! ప్రపంచాధినేతయగు నా నృపతి నందినికిఁ ద్రోవ నడుమఁ బచ్చగడ్డిపఱకల నందించుచు, గోకుచు నడవి యీగలను దాని మేన వ్రాలనీక పోఁదోలుచు, దాని యిచ్చ వచ్చిన తెరువునఁ బోనిచ్చుచు సేవించుచుండెను. గురునానతిని వీసమేని జవదాటక యది నిలిచినఁ దాను నిలుచును; నడచిన నడచును; కూరుచుండినఁ గూర్చుండును. అది నీరముంగ్రోలినఁ

దానును నీరముం(గోలును. ఇట్లు గోసేవయందు మగ్నుడై దానిని వెన్నంటిపోవుచున్న యా నరపతికిఁ బార్శ్వతరువుల మీఁది విహగములు కలకలారవముల స్వాగతమిచ్చుచుండెను. ఆ రాజసింహుని మార్గమున నిఱుదండలనున్న లేఁదీఁగెలు గాలికిఁ గదలఁబాఱి పూలవానలఁ గుఱియసాగినవి.

విశ్వపాలకుఁడగు నమ్మాన వేంద్రుఁ డాయడవినిఁ గాలు పెట్టినంతనె వానలేకయె కాఱుచిచ్చు చల్లారినది. భూజము లెల్ల పూతల నిండారినవి. పులులవంటి (ముక్కుఁడి మృగములు లేళ్ళవంటి సాధుజంతువులను బాధింపమానినవి. ఇట్లు కొంత దవ్వేగ నంతట సంజ(ప్రొద్దెఱ్ఱవాఱెను. తపసియా వింటి మొగము పట్టినది. అడవిలోని నెమిళ్ళ తమనివాసభూజముల మీఁదికెగసి వచ్చుచుండెను; పచ్చికబీళ్ళలో జింకలెల్ల కడుపులుగట్టి నడయాడుచుండెను. అట్టి వింతసీను నాకాంతా రమునుఁజూచి యానందించిన నరపతియు నా(శమోన్ముఖుఁడై పోసాగెను.

ఉపవసించిన వారు మిగుల దప్పిచెంది యాదరబాదరగా నీరు(త్రాగు విధంబున సుదక్షిణాదేవి, నందినితో నడవినుండి తిరిగివచ్చు కాంతుని తన దప్పివడిన నే(త్రములతో (త్రాగి వైచునదివలె ఱెప్పవేయక చూచుచుండెను. పిదప సుదక్షిణా రమణి యక్షతలగిన్నె చేఁదాల్చి గోమాతకుఁ (బదక్షిణము గావించి దాని నొసటిని బూజించెను. అట్టియెడ నా నందిని తనదూడను జూచుకొని పాలీయఁ దమకపడుచున్నదయ్యు

శాంతముతో నాపూజను స్వీకరించెను. అట్టిటు కదలక తమ పూజ నా నందిని స్వీకరించుట తామనుభవింపఁబోవు వ్రత ఫలమునకు సూచకము గదాయని రాజదంపతులు దాని కటాక్షలాభమున కానందించిరి.

పిదప నా రాజన్యుఁడు గురుదంపతుల పాదములకుఁ బ్రణమిల్లి, సాయంతనానుష్ఠానముల ముగించుకొని, కోర్కులఁ దీర్చునమ్మొదవును బాలుపిండిన పిదప పరుండియున్న దానిని జేరి సేవింపసాగెను. అనంతర మా నరపతి తనయర్ధాంగి తోడు కేఁగ నా గోవుసమీపమున జ్యోతులనిడి యుపహార ముల నర్పించి దానికడ నుపవిష్టుఁడై యది నిద్రించినంత నె తానును నిద్రించి ప్రాతఃకాలమున నది లేచుటతోడ నె తానును నిద్ర లేచెను.

ఇప్పగిది సుకీర్తియగు నాభూపతి సంతార్థియై ధర్మ సతితోఁగూడి యిరువదియొక్క దినంబులు గోసేవావ్రతము నతిశ్రద్ధతో సాధించెను. ఇరువదిరెండవ దినంబున నందిని దిలీపరాజుభక్తిని శోధింపఁదలంచి గంగాపాతముపొంత లేఁ బచ్చికతో సొంపారు నొక్క హిమగిరి గుహానడుమఁ జొచ్చెను.

## మాయాసింగము

సర్వశాసకుఁడగు తాను రక్షకుండై యుండఁ తన నందిని నే క్రూరమృగమేని తాకఁజాలదను నమ్మకముగల యా

న రేశ్వరుఁడది గమనింపక హిమగిరిశోభను దిలకించు వినోద మున నొక్కక్షణకాలము మైమఱచియుండెను.

ఇంతలోన దాటున నెటనుండియో యొక్క కంఠీరవ మేఁగుదెంచి యా నందినిపైలంఘించి బలాత్కారముగ దానినీడ్చుచున్నట్లొక దృశ్యమటఁ గల్పితమయ్యెను. అంతట నా నందిని గావించిన యంభారవము గుహానిండి ప్రతిధ్వనింప నది మఱింత భీకరమై యా ఱేని చెవిఁబడెను. దాన నా గోభక్తుఁడదరిపడి బెదరిన గుండియలు దడదడగొట్టుకొన నద్రిశోభను దిలకించుటలో లగ్నమగు తనచూడ్కిని దటాలున వెనుద్రిప్పిచూచెను. తోడనె యావిలుకాఁడు తన గోమాతమూఁపున సటాజాలమును నిక్కించి యుగ్రమూర్తియై యున్న మృగేంద్రమును గాంచెను.

## బా హు స్తం భ న ము

కాంచినదే తడవుగ, సింహబలుఁడగు నానరకంఠీరవుఁడు తన యేమఱుపాటున నాగోవునకట్టి చెట్టుపుట్టినందులకు సిగ్గిలి యా మృగేంద్రమును వధింప బాణము తివియఁ బూనెను. కాని యది యేమిచిత్రము! బాణములాగుటకై యంప పొదియందిడిన యావీరుని కుడిచేయి చిత్తరువున వ్రాసిన మాడ్కినట్టె కట్టువడిపోయెఁగాని బయటికి రాదయ్యె! దాన నా యభిమానికి రోసమినుమడించెను. కాని ఫలమేమి? మంత్రౌషధములచేఁ గట్టువడి శక్తియుడిగిన మహానాగము

పోల్కి తన యెట్టయెదుటి చెనటిని జెనకఁజాలకయున్న తన దుర్దశకై రాజు వగచుచు లోలోనసె మండిపడుచుండెను. దిలీపుఁడు తనకుఁగలిగిన యీయవస్థ కక్కజమందుచుండ నాతనిని మఱింత యాశ్చర్యమున ముంచునట్లాసింగము మనుజ భాషణముల నిట్లనియె—

"మహీపాల! ఏల నీకీ వృథాయాసము? నీయమ్మును నాపై గ్రుమ్మినను నయ్యది వ్యర్థమేయగును. వాయువెంత సత్త్వము గలిగియుఁ జెట్లను బెల్లగింపజాలునె కాని కొండలఁ గదలింపఁజాలునే? నా వృత్తాంతము నాలకింపుము. నేను శివకింకరుఁడను. నికుంభునకు దీటగువాఁడను. నాపేరు కుంభో దరుఁడందురు. పరమశివుఁడు తన వృషభవాహనముఁ నారో హించునపుడు నావీపుపైననె కాలుంచి యనుగ్రహించును. దీనిచే నాకుఁగల శివానుగ్రహ మేపాటిదియో నీవ యూహించు కొనుము. అదేడా! ఇదిగో! యీ నీముందున్న దేవదారు తరువును బరికింపుము. పరమశివుఁడు దీనిని దనముద్దు కొమరునిగఁ బెంచుకొనుచున్నాఁడు. పరమేశ్వరి స్వయముగ నీ చెట్టునకు బంగరుకడవలతో నీరుబోసి కుమారునకుఁ బాలిచ్చి పెంచనపగిది దీనిని బెంచినది సుమా!

"ఇట్టి యీ చెట్టుకడ కొక్కనాఁడు వనగజ మొక్కటి యేఁగుదెంచి కపోలముల కండూతితీఱునట్లు దీనిని రాచు కొనఁగ నీచెట్టుచర్మ మూడిపోయెను. అంత నా గిరికుమారి రక్కసుల శస్త్రపుదెబ్బలఁదినిన తన కొమరునికై విలపించిన

ట్లీచెట్టునకై కడుశోకించెను. అదివినిన పరమశివుఁ డానాటి నుండియె వనద్వీపములఁబట్టి శిక్షింప నన్నిట్లు సింగమైయుండ నియోగించె.

"కావున నోరాజా! పరమేశ్వరుఁడు నియోగించిన భోజనవేళకియ్యది నాకడకు వచ్చినదికదా! ఆఁకొనియున్న నాకీ మొదవు రుధిరము తనివిదీర్చును. ఇఁక నీవు సిగ్గుపడక మఱలిపొమ్ము. నీయందు గురుభక్తి కిసుమంతయేని కొఱంత గలుగఁబోదు. నీవు దీనిని రక్షింపఁజాలకుండట నీతప్పుగాదు."

అనిపలికిన సింహము పలుకులువిని తనచేయి కట్టు వడినది శివప్రభావముచేతనని యెఱిఁగి ఱేఁడా కేసరికిట్లనియె-

"సింహమా! ప్రస్తుత మీశ్వరేచ్ఛచే నాప్రతాప మణఁగి యుండుటచే నేనాడనున్నమాట నీకు నగవుఁ గొలుపవచ్చును. అయినను నీవు పరుల మనోగతభావముల నెఱుంగఁజాలిన వాఁడవగుట నీతో నొక్కపలుకు పలికెద నాలింపుము. సకల విశ్వమునకు సృష్టి, స్థితి, లయకారకుఁడగు నా పరమేశ్వరుఁడు నాకుఁ బరమపూజ్యుఁడే యగును. కాని నా గురునకు నగ్ని హోత్ర సాధనమగు నీగోధనము నశించుచుండఁ జూచుచు నుపేక్షించుట లగ్గుగాదు. కనుక దయతో నను భక్షించి నీ కడుపుచిచ్చు నార్చుకొనుము. ఇపుడు సాయంతనమైనది. దీని బిడ్డ తల్లికై యంగలార్చుచు నారాటపడుచుండుఁగాదె! ఇది లేకున్న నాగురుని లోకకల్యాణకార్యమునకు విఘ్నము వాటిల్లు. కావున దయచేసి దీనిని విడిచిపుచ్చుము."

రాజాడిన యీ మాటలకు సింహరూపుఁడగు నా శివ కింకరుఁడు కొండగుహల చీకటి పటాపంచలగునట్లొంచుక నగి రాజుతో మఱలనిట్లనియె—"రాజా! చక్రవర్తిత్వమును, సుకుమారమగు దేహము నల్పలాభమునకై బలి యీనున్న నీ తెలివి నేమందును? నీకుఁ బ్రదుకు నందాశగల దేని యొక్కట విషయము నరసికొనుము. అదేమన, నీవు దేహము నర్పించి నచో నీ గోవొక్కటియె బ్రదికింపఁబడినట్లగును. అట్లుకాక నీవె బ్రదికియుందువేనిఁ బ్రజలనెల్లరఁ గష్టములనుండి కాచి తండ్రివోలె వారలఁ గాపాడినవాఁడ వగుదువుకాదె!

"ఒకవేళ నీవు, నీగురునకుఁగల దిదియొక్కటియె యావనియు, దీనిం బోగొట్టినచో నగ్నితుల్యుఁడగు నమ్ముని యలిగి శపింపఁగలడనియు భీతిలుచుంటివి కాఁబోలు! నీకా భయ మిసుమంతయేని వలదు. ఆ గురునకువలసినఁ గోట్లకొలఁది గోవులనిచ్చి యాయనకోపాగ్ని నార్పవచ్చును. కావున నో వెఱ్ఱి ఱేఁడా! సుఖానుభూతికి యోగ్యమగు నీ దేహమును గాచు కొనుము. ఈ యావును రక్షింపమిచేగలుఁగు పాపమువలన నీకు స్వర్గలాభము చెడునని తలంపకుము. సకలసంపదలఁ దులఁదూగు నీ భూరాజ్య మింద్రపదవియేయని పెద్దలందురు. యోచింపుము. మూఢుఁడవై యూరక చెడకుము." అని పలికిన శివానుచరుని పలుకులనువిని మహారాజు, సింహ భయముచే జాలిఁగొలుపు చూపులతోఁ దన్నుఁగాంచు నమ్మొదవుపైఁ గనికరమూని వెండియు నిట్లనియె—

"శివకింకరా! నేను క్షత్రియుఁడను. అనఁగా, నాశమునుండి రక్షించువారమగుటచే మాజాతి కాబిరుద మబ్బినది. పేరుసకుఁదగిన ప్రవర్తనములేక, పటాటోపమునకై బిరుదులు మోయువానికి రాజ్యమేల? బ్రదుకేల? అది యటుండనిమ్ము. కోట్ల పాడియావులనిచ్చియు మాగురుని సమాధానపఱచుట యసాధ్యము. ఈగోవు కామగవికంటె తక్కువది యని తలంతువే! ఈశ్వరేచ్ఛచే దీనిని నీవాక్రమింపఁగలిగితివి. కాని లేకున్న దీనినిట్లు చెనకఁజూచుట నీకుఁ దరమా? మిగుల మహిమల నలరారు నీగోవును గాపాడ నాయొడలిని నీకొసంగుట యుక్తము. ఇట్లు గావింతునేని నీ భోజనమును చెడదు; నాగురుని యజ్ఞకార్యములకును విఘ్నమావహిల్లదు.

"ఓయీ! అత్తయు నొకయింటి కోడలన్నట్లు నీవు నొక్కరికి సేవకుఁడవెకదా! నీకును నీ దేవదారు తరువుం గాచు గొప్పభారము గలదుగదా! రక్షణీయమగు దానిం జంపించి తాను తప్పించుకొనిన సేవకుఁడు తన యజమానికడఁ దలయెత్తఁగలుగునే! కనుక నా యసురులనేని బలియిడి గురునిగోవుని గాపాడుట విధి. నా యీ నశ్వర దేహమును మెసవి శాశ్వతమగు కీర్తిదేహమును నాకొసంగుము. మను వంశజన్ములు పాంచభౌతికమగు నీనశ్వర దేహమున కాశపడ రని యెఱుంగుము. మిత్రమా! ఏడడుగులు కలిసినడిచినను, మాటలాడినను స్నేహము గలుగునందురే! అట్టిమైత్రి మనకీ

నట్టడవినిఁ గలిగినది కాదా! ఇపుడు నీవు కాప్తమిత్రుఁడవుగదే! స్నేహితుని ప్రార్థనమును త్రోసిపుచ్చుట పాడిగాదు. రమ్ము! నను బలిగొమ్ము.''

రాజు ప్రార్థన ముగియుటయే తడవుగ సింహము నందిని విడచెను. నరేంద్రుని కట్టువడిన కరమును స్వాధీనమయ్యెను. అంత నాసత్యసంధుఁడు తనవాగ్దానమును జెల్లింప, మాంసపు కండ నందించినటు లాకేసరి నోటికి తనమేనొప్పగించెను. అయ్యారే! ఆనాఁటిరాజన్యుల త్యాగశీలము లెంతటి నిర్వ్యాజములో కదా! అయ్యెడ నామహీకాంతుఁడు గుండె దిటవున, ఘోరముగఁ దన్నాసింగ మాక్రమించునని తలంచి తలవంచి నిశ్చలుఁడై యుండెను. సింహమా మహాత్యాగిపై దుముకవలసిన సమయమది! కాని యదేమిచోద్యము! సింహముదుముకుటకు బదులుగ తేనె నెమ్మేన పూలజాలు దొంతరలు పైనున్న విద్యాధరుల కరములనుండి కురియుచున్నవి. ఆహా! యదెట్టి సత్యకాలమొకదా! పూలజాలుతోఁ బాటు 'వత్సా లెమ్ము' అను నమృత తుల్యమగు పలుకు వినఁబడునంత నాతేఁడు శిరమెత్తిచూచుసరికిఁ గన్నతల్లివోలె నందిని యెట్టయెదుట సాక్షాత్కరించెను. సింహమదృశ్యమయ్యెను.

## వరప్రాప్తి

అచ్చెరువందుచున్న రాజుతో నందిని యిట్లనియె.

"సజ్జనుఁడా! ఇపుడు జరిగినదంతయు నామాయ. నినుఁ బరీక్షించుటకె నేనిట్లు కల్పించితిని. మా మహర్షి ప్రభావమున నా యముఁడేనియు ననుదరియఁజాలఁడు. ఇఁక నితరమృగములమాట వేఱెయడుగనేల? పుత్ర! నీకుఁగల గురుభక్తికిని, నాయెడ నీవుచూపిన కనికరమునకును సంతసించితిని. నీయిచ్చవచ్చిన వరమడుగుము. నేను పాలుమాత్రమె యిచ్చు మామూలు మొదవును గాదనుమీ! నేనను గ్రహించితి నేని యెల్లకోర్కెలను పిదికి యీయఁగలను."

నందిని వచనములవిని యామహావీరుఁడు చేనునిపగిదిఁ గరములుమోడ్చి "అవ్వా! నావంశమునకుఁ గర్తయు, స్థిరకీర్తియునగు సుపుత్త్రుని సుదక్షిణాసతి యందనుగ్రహింపు" మని వేడుకొనెను. నందిని దిలీపుని ప్రార్థనమునకు వల్లెయని వరమిచ్చి "బిడ్డా! నాపాల నాకుదొప్పలోఁబితికి త్రావు" మని యానతిచ్చెను. రాజును దానియనుగ్రహమున కలరి "తల్లీ! నీవత్సము త్రావినపిదపను, మునిహోమమున కుపయోగింపఁగను మిగిలిన నీదుగ్ధమును గురుని యనుమతి వడసి త్రాగఁగలవాఁడ" నని విన్నవించెను. తేనిమనవి నాలించి నందిని మఱియు నానందించి గుహనుండి వెలువడి యనాయాసమున రాజుతోఁ దపోవనమున కేతెంచెను.

ఆశ్రమము చేరినంతనె రాజాధిరాజు నందిని యనుగ్రహమునుగూర్చి మునుమున్నుగ గురునకును బిదపఁ బ్రియసతికిని వాక్రుచ్చెను. పిదప గురునియాజ్ఞనొంది,

దూడకును, హోమమునకు నుపయోగింపఁగా మిగిలిన నందినీ దుగ్ధముల మిగులఁ బ్రీతితోఁ గ్రోలెను.

మఱునాఁటి వఱువాతనె వసిష్ఠుఁడా దంపతులననురూపముగ నాశీర్వదించి రాజధానికిఁ బయనము గావించెను. దిలీపుడు హోమాగ్నికిని, గురుదంపతులకును, నందినికిని బ్రణమిల్లి నగరోన్ముఖుడయ్యెను. దారిలోఁగల వింతలఁగాంచుచుఁ గృశించిన దేహముతో నారాజు రాజధానిం జేరఁ జిరకాలము నుండి రాజదర్శన విరహమునఁ గుందుచున్న ప్రజలు శుక్ల విదియనాఁటి చంద్రుని గాంచినట్లా రాజచంద్రునింగాంచి సంతసమున స్వాగతమొసంగిరి. దలీపచక్రవర్తి పురందర వైభవముతోడ రాచనగరుఁ బ్రవేసించి యాదిశేషునకు దీటగు తనభుజదండమున మఱల రాజ్యభారమును పూనెను.

అనంతరము కొంతకాలమునకు సుదక్షిణాదేవి, దివి తనగర్భమునఁ జందరునిఁ దాల్చినపగిది, మందాకిని తన గర్భమున శివతేజముగు షడానుని ధరియించినమాడ్కి, నింద్రాది దిక్పాలుర యంశములతోఁగూడిన గర్భమును దిలీపుని వంశాభివృద్ధికిగాఁ దాల్చెను.

ఇది మూఁడవ ప్రకరణము.

---

# చతుర్థ ప్రకరణము

## రఘు జననము

దిలీపునికి సంతోషదాయకమును, ఇక్ష్వాకువంశాభివృద్ధికి ముఖ్యకారణమునగు సుదక్షిణాదేవియొక్క గర్భధారణవిషయము నంతఃపురజనులచే నెఱింగిన దిలీఁపుడు మోదాతిరేకముగ మొగమింత చేసికొని తననెమ్మోని సొమ్ములనెల్ల నొలిచి వారికిఁగానుకలు పెట్టెను. సహజముగనె లజ్జావతియగు నారాణి గర్భవతిగానున్న కాలమునఁ దన మనోవాంఛల నెన్నఁడును వెనిమిటికెనడుగదు. ఆమె పండు టెడఁదలోఁగల కమ్మని కోర్కులనెఱిఁగి వాటి నీడేర్పఁదలఁచి రాజెన్నిమాఱులో యామెనడుగును. కాని మహాపతివ్రతయగు నాభామ సహజసుందరమగు నొక్క చిఱునవ్వునే సమాధానముగ నొసంగి, తలవాంచి మిన్నకుండును. నాకిది వలయునని నోరెత్తియడుగదు. గర్భవతియగు తనసతి మనసునఁగల యొక్కకోర్కెయేనిఁ దీర్పనిచో దనకుఁ దృప్తి గలుగఁబోదని యారాజు దురపిల్లును. అట్టిపట్టుల నొక్కొకప్పుడు దిలీపుఁడు సతీసఖులఁ జేరఁజీరి "భామలారా! మీచెలి మిగులసిగ్గరి. తనకోర్కుల నెన్నఁడును నాకడ వెల్లడింపదు. ఆమెకు దేనిపై మనసుగలదో మీరు వెల్లడింపుఁ డిప్పుడ నెరవేర్తు" నని కడునాదరమున మాటికిమాటి కడుగుచుండును.

సుదక్షిణాదేవికిఁ గొన్నాళ్లకు వేవిళ్లగొడవ తీరినది; చిక్కినతనూలత బలుపుచెందినది. అట్టి దశయందాతరుణి పండుటాకులరాల్చి మఱలఁ జిగుర్చిన లతామతల్లికవోలె భాసిల్లినది. గర్భవతియగు నారాణిరత్నాలగని కడుపునఁగల భూదేవిపోల్కి, నగ్నిగర్భయగు శమీలత చందమున దిలీప రాజు కన్నులకుఁ గాన్పింపఁదొడఁగెను. ఇట్లు సతీగర్భము క్రమాభివృద్ధి నొందుచుండ నాతఁడు యథాకాలమునఁ బుంసవనాది గర్భసంస్కారముల నెఱవేర్పించెను. క్రమముగ రోజులుగడువఁ బదియవ నెలయువచ్చెను. పిదపనొక్కనాఁడు సుమూర్తమున నయిదుగ్రహములు తమతమ యుచ్ఛస్థాన ములందుండ శచీసమానయగు సుదక్షిణాదేవి రతనాల రాశివంటి కొడుకునుగనెను.

ఆ సుకుమారుఁడు జనించిన వేళదిక్కులు ప్రసన్నములై కలకల లాడినవి. మేనులకు హాయిగొల్పు గాలివీచినది. ఇట్లెల్లయెడల నెల్ల విషయములును మంగళ సూచకములుగా నుండెను. మహాజనుల జననములు లోకకల్యాణమునకె హేతువులగునుగదా!

## జన్మోత్సవము

కొడుకుపుట్టిన సువార్త నెఱిఁగించిన యంతఃపురజనులకు మహారాజు తనచేతికందిన దానినెల్ల బహుమతిగా నొసగెను. ఇక్ష్వాకుకుల పురోహితుఁడగు వసిష్ఠమునీంద్రుఁడీ శుభవార్త

విని తన యాశ్రమమునుండి. రాచనగరుకే తెంచి యాబాలు
నకు జాతకర్మ సంస్కారమును బూర్తిగావించెను. చెవుల
పండువుసేయు తూర్యధ్వనుల సంబరములతో, సుందరీ
బృందముల నృత్యగానములతో నావేళ రాజప్రసాదము
సందడి చెందుచుండ నట దేవకాంతల నాట్యభంగిమలతో,
దేవదుందుభుల మ్రోతలతో నాకసమునను సందడి
మెండయ్యెను.

సాధారణముగ నిట్టి సంతోష సమయములలోఁ జెఱ
లలోనున్న బందీలను విడుదలచేయుట లోకాచారము. కాని
యా ధర్మప్రభు రాజ్యమున నాతని ధర్మపాలనము మూలమున
నెందునను బందీయను వాఁడె లేఁడయ్యెఁగదా! ఇక నాతేఁ
డెవ్వరిని విడిపింప సంతసించును! కాని యొక్క విశేషము.
అదేమనిన, నింతదనుకఁ పితృణమను పేరిచెఱనున్న యా
సుకృతి సుపుత్ర వంతుఁడయిన కతమున నాచెఱనుండి
విడుదలఁగాంచినాఁడు.

ఇఁక నీ కొమరునకుఁ బేరిడవలయుఁగదా! లోకమునఁ
దల్లిదండ్రులగు వారికిది యొకపెద్ద సమస్యయె. పడఁతి తన
వంకవారి పేరుల సూచించును; పెనిమిటి తనపూర్వులపేరు
లెత్తును. ఒకరు తాతముత్తాతలపేర్లు త్రవ్వుదురు; మఱొకరు
నవనాగరక నామములకై వలవేయుదురు. తుదకొక
నిశ్చయమునకే తెంచి యందమును సూచించు పేరిడుదురా
యా జాతకుఁడు పగలుచూచిన రేయిఁగలలోఁ గన్పడు

నట్లుండును. పోనీ, గుణసూచకమగు పేరు పెట్టుకొందురా అది నేతిబీరకాయ కేమాత్రము తీసిపోదు. కావునఁ దమ పిల్లలకుఁ బేరు పెట్టుటలో సంసారులకొకతీరుబాధ కలదనుట తప్పుకాదు. కాని మన దిలీప సార్వభౌముని కట్టిచిక్కు లేవియుఁ దటస్థింపలేదు. ఏలయన, రాజు పండితుడు; శబ్దార్థజ్ఞానము లెస్సగఁగలవాఁడు. కావున లెస్సగనాలోచించి యీయర్భకుఁడు సకలశాస్త్ర పారగుఁడును, శత్రువుల యంతుగనుగొను వాఁడును గావలయునను తలంపున నాయర్థమునిచ్చు 'రఘు' వనునామము నా కుమారునకుఁ బెట్టెను.

పిదప నా కొమరుఁడు సకలసంపదలతోఁ దులదూఁగు నా తండ్రిపోషణమున నందమగు నవయవరాజితో రాజిల్లుచు ననుదిన ప్రవర్థమానుఁడగు జాబిల్లివోలె నెదుగుచుండెను. అట్టి ముద్దులమూటయగు నాబిడ్డనిఁగాంచి యాతల్లిదండ్రులు కుమార స్వామింగనిన యుమామహేశుల చందమున, జయంతునిఁజూచియుప్పొంగు శచీమహేంద్రుల మాడ్కి మురియుచుండిరి.

## రఘువు బాల్యము

పసివాఁడగు రఘువు బుడిబుడినుడువుల నొడువఁ దొడఁగెను; నమస్కరింప నేర్పినచొప్పునఁ దండ్రికి నమస్కరింపనేర్చెను. కొమరుని పోకడలకుఁ దండ్రిపరమానందము నొందుచుండును. ఒక్కొక్కప్పుడాతండ్రి, కొడుకును దన యొడిలో నిడికొని యాపసిమేనితాకుడు తన శరీరమునకు

సోఁక నమృతము ద్రావినట్లానందించును. ఆ యానందపారవశ్యమునఁ గన్నులఱమోడ్చి కొమరుని స్పర్శసుఖ మిట్టిదికదా యని లోలోన నానందించును. ఆ సుపుత్రునిచేఁ దనవంశము తరించిన ట్లువ్విళ్లూరుచుండును.

క్రమముగ మూఁడగునేటఁ జూడాకర్మ సంస్కారము నంది యాబాలుఁడు కాకపక్షములతో నెగిసియాడు తనతోడి డింభకులతోఁ గలిసియాడుచు నైదగునేట నక్షరాభ్యాసము నంది శబ్దజాలమును సులభముగఁ బుక్కిటఁ బట్టఁగలిగెను. పిదప నా రాజేంద్రుఁడు యథాశాస్త్రముగ నాబాలుని గర్భైకాదశంబున నుపనీతుఁగావించెను. ప్రచండపండితులగు గురువులావటునకు విద్యోపదేశముఁ గావించిరి. వటుఁడును గురువులయెడ భక్తియు, విద్యయెడల రక్తియుఁ గలిగి నేర్చుటచే దేశికుల ప్రయత్నము విఫలము కాలేదు. సుక్షేత్రమునఁ జల్లినబీజములును, సత్పాత్రమునఁ జేయబడినఁ దానమును విఫలములు కావుగదా!

కుశాగ్రబుద్ధియగు విద్యార్థికుండఁదగిన శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహ, అర్థవిజ్ఞానము ననుధీగుణముల నుపయోగించి యా విద్యార్థి దండనీత్యాది రాజకీయవిద్యలను సులభముగ గ్రహించెను. ఆ కుమారుఁ డాగ్నేయాది మహాస్త్ర విద్యలను సమంత్రకముగఁ దన తండ్రి వలననే గ్రహించెను. ఇట్లు మనువంశదీపకుఁడగు రఘువు విద్యాభ్యాసమును పూర్తిగావించి బాల్యమును గడచి యౌవనదేహమును దాల్చి మదనమోహనుఁడై రాజిల్లుచుండెను.

పిదప దిలీపచక్రవర్తి కొడుకునకు స్నాతకవ్రతమును నడిపించి వివాహమంగళమును నెఱవేర్చెను. అందాలగనులగు పలువురు కన్నెమిన్నలా సుందరుఁడగు రఘువును మగనిఁగాఁ బడసి మిగులముదమందిరి.

యౌవనమహిమచేఁ గండలుదేఱిన మూపులతోఁ గవాటతుల్యమగు విప్పౌటురముతో, విశాలమగు కంఠభాగముతో నా యువకుఁడు తండ్రినిమించియు వినయసంపదమూలమున తండ్రికంటె తక్కువగనే కన్పట్టుచుండెను.

ఇట్లు వయసు, విద్య, వినయాది సుగుణములతో విలసిల్లు కన్నకొమరునిఁగాంచి దిలీపభూజాని తానుచిరకాలమునుండి మోయుచున్న రాజ్యపాలనభారమును తగ్గించుకొనఁగోరి కుమారుని యువరాజుం గావించెను. గాలితోఁ గూడిన యగ్ని, మేఘములులేని శరత్కాలమున వెలుఁగు వేవెలుఁగు, మత్తెక్కిన కరీంద్రమును దుస్సహములయిన పగిదిఁ బ్రచండ పరాక్రముఁడగు రఘువుతోఁగూడిన దిలీపచక్రవర్తి పగతుర కసాధ్యుఁడై యుండెను.

ఆ కాలమున నే రాజేంద్రుఁ డధికాశ్వమేధములఁ గావించునో యాతఁడె ఘనుఁడని భావింపఁ బడుచుండినది. ఆ యాచారము ననుసరింపఁ దలఁచిన దిలీపనృపతి వీరవరులగు రాచకొమరులఁ దోడిచ్చి, రణధీరుఁడగు రఘువును యజ్ఞాశ్వరక్షకునిఁగఁ జేసి నిరాటంకముగఁ దొంబది తొమ్మిదశ్వమేధములఁ గావించెను.

ఇది నాలుఁగవ ప్రకరణము.

# పంచమ ప్రకరణము

## ఇంద్ర - రఘువుల యుద్ధము

నూఱు జన్నము లొనర్చినవానికి 'శతక్రతు'వను బిరుద మబ్బును. అట్టి బిరుదు నొందఁ గోరి యొక్కటి తక్కువగ నూఱు జన్నములఁ జేసిన దిలీపుఁ డా యొక్కజన్నమును గూడఁ బూర్తిసేయఁదలఁచి వ్రతియై యథావిధిని యజ్ఞాశ్వమును బూజించి విడిచెను. యువరాజగు రఘువే దానికిని బ్రధానరక్షకుఁడు. నిరంకుశుఁడగు కవీంద్రుని చందమున నెదురులేక యుఱుకులువెట్టు నా ఘోటకమును గాంచి శచీపతి యసూయాపరుఁడై, యదృశ్యరూపమున నేగుదెంచి రక్షకుల సమక్షముననె యా యశ్వము నపహరించెను.

అంతట రఘుని సైనికులు నిర్విణ్ణులై యేమిచేయునుం దోపక దిగులుపడి యుండిరి. దిలీపుని సంతతిపైఁ గామగవి సంతతికెట్టి యనుగ్రహానుబంధముగలదో కాని యిట్టి విచారకర సమయమున రఘు సైనికులకు వసిష్ఠుని నందినీధేనువు ప్రత్యక్షమాయెను. దాని ప్రభావము నింతకుమున్నె వారు కర్ణాకర్ణికగ నెఱింగియుండిరి. అంతట సుజనవంద్యుఁడగు నా రఘురాజమౌళి నందినింగాంచి భక్తిపారవశ్యమున గాత్రము పులకింప నా నందినీమూత్రమునఁ గన్నులు గడుగుకొనెను. ఏమి చిత్రము! ఆ నందినీప్రభావ మెట్టిదియోకాని వెంటనే

యా రఘువీరునకు నింద్రియములకుఁ గోచరముకాని వస్తుజాల మెల్ల గోచరము కాసాగెను.

అయ్యారే! ఆతని భాగ్య మేమనవచ్చును! ఎట్లయి నను దప్పించుకొని తన రక్షకునిఁ జేరుటకై యిటు నటు నా తురగము తురంగలించుటయు, దాని కావరము నణప నింద్ర సారథి యగు మాతలి దానిని దన తేరిపగ్గములచే కట్టివైచు టయు, నట్టి యవస్థకుఁ జిక్కిన యా ఘోటము నా నాకపతి తూర్పునకుఁ గొంపోవుచుండుటయు నా రఘురాజున కొక చిత్తరువున మాడ్కి గోచరించెను.

వేయి కన్నులు; హరితాశ్వములు. ఈ గుర్తులనుబట్టి గుఱ్ఱపుదొంగ దేవనాథుఁడని యెఱిఁగి రఘుపతి యాతని నద లించుచు మిన్నుముట్టు నెలుంగు వెలునడఁగడు ధీరముగ నిట్లనియె—"స్వర్పతీ! యజ్ఞభాగములఁ గొనువారిలో నీవే ప్రథముఁడవని యెన్నఁబడుదువుకదా! అట్టి నీవే నా తండ్రి యజ్ఞమును జెఱుపఁదలంచుట పాడియె? నాకపతీ! త్రిలోకము లకు నీ వధిపతివి? యాగవిద్రోహులను గనిపెట్టి శిక్షింప వలసినవాఁడవు. అట్టి నీవె ధర్మపరుల కార్యములను జెఱుపఁ దలఁచితివి. ఈ యశ్వములేనిదె మాయాగము పూర్తికాదు. మా గుఱ్ఱమును మాకు విడువుము. సద్వర్తనులని పేర్వడసిన నీబోటి పెద్దలు చెడునడవడికిఁ గడంగుదురే!" యని పలుక విని యా భూలోకవీరుని ప్రాగల్భ్యమున కచ్చెరువంది దేవ నాథుఁడు తన తేఱిని మఱల్చి యిట్లనియె—

"వీరకుమార! నీ వన్నది యథార్థము. కాని మాబోటి యశోధనులు పరులవలనఁ దమ కీర్తికి ముప్పు రాకుండఁ గాచుకొనవలయును. నూఱు జన్మముల నిండుగ నొనర్చి నా యశమును నీ తండ్రి హరింపఁజూచుచున్నాఁడు. కనుకనె నీ తండ్రి జన్నమును నేఁ జెఱుపఁదలఁచితిని. సకల భువనములలో నా కొక్కనికె 'శతాశ్వమేధి' బిరుదము చెల్లఁ దగునుగాని యన్యులకుఁగాదు. నా 'శతక్రతు' నామమును నీ జనకుఁడు కొల్లగొనకుండ నీ నూరవ సత్త్రమును నే విఘ్నము గావింతును.

"అందులకై నీ జన్నపు గుఱ్ఱమును నే నపహరించితిని. దీనిని తిరిగి కైకొనుట నీ తరముగాదు. ఒక వేళ, దీనిని సాధింప యత్నింతు వేని మున్ను సత్త్రిహయమునకై సగరుని సుతులకుఁ గలిగిన గతియె నీకుఁ బట్టును జుమీ! చక్కగ యోచించుకొనుము."

అశ్వరక్షకుఁడు రఘువు పురందరుని పలుకుల కులుకక పకపక నగి "పురందరా! నా గుఱ్ఱమును గొనుటయె నీ నిశ్చయమేని ధనువును ధరింపుము. మహావీర కకుత్థ్సుని వంశమున జనించిన యీ రఘువు నోడింపక నీవు ధన్యుఁడవని తలంపకుము" అని పలికి యా యువరాజు వింట శరసంధానముఁ గావించి వీరాసనమున నిలిచి నాకపతిని డీకొన సిద్ధముగ నుండెను.

రఘువు పలుకులు ములుకులై తన గుండియలం

గ్రుచ్చుకొన ననిమిషపతి యుక్కురోషమునఁ దన వన్నెల వింట నమోఘశరము నొక్కదానిందొడిగి, పగతుని గుండెకు గుఱిచూచి విడిచెను. పెక్కురు రక్కసుల నెత్తురు గ్రోల మఱిగిన యా యింద్రనారాచము రఘుని విశాలవక్షమున నాటుకొని యాతని యెడఁదను నెత్తుట జొత్తిలజేసెను.

రఘువుమాత్రము సామాన్యుఁడా! కొంచెమువదన మాతని కొలమునకె దూరము. బీరమున నా వీరుఁడు మాకుమారునకు దీటగు దిట్ట. కావున నా శూరుఁడు తన నామాక్షరములఁ జెక్కిన యొక్క చుఱుకుటమ్ము వింటఁ దొడిగి యా శచీపతి యంశతలమున గుఱిపెట్టి కొట్టెను. మఱియొక యమ్మున నా దేవవిభుని టెక్కెము విఱుగఁగొట్టెను. ఆ టెక్కెము పాటు సురలక్ష్మి కేశచ్ఛేదము పోలెఁ దోచి దేవనాథుని మనమున కవమానమును గల్పించెను. ఇంద్రున కీమాఱు రఘువుపై పామువగ పుట్టెను. ఆ సురపతి నరపతుల కొకరిపై నొకరి కీసు జనించినది. ఒకరిఁ గెలువ నొకరు పంతాలాడుచుండిరి. పోరు మొదలయి యింతయై, యింతింతయై, మఱియు నింతయై తుదకు ఘోరమయినది. సురేశు శరములు క్రిందికిని, నరేశు నారసములు మీదికిని గరుడువలెఁ, బాముల పగిదిని పర్వసాగినవి.

ఇంతలో వీరవరుఁడగు దిలీపసూనుఁడు పాకారికరమున మిడిసిపడునారిత్రాటి నొక్క యర్ధచంద్రబాణమునఁ దెగవేసెను. టెక్కెము తెగుటకె కక్కసపడు నా సురేశున కీ

నారికోతచేఁ బుంటిమీఁదఁ గారము చల్లినట్లయ్యెను. అంతట నా నాకాధీశుఁడు మదిని మచ్చరమూని యెట్లేనిఁ దనపగతుఁ డగురఘువు నంతముకనుగొననెంచి చేతిచాపమువీడి కఠోర మగు వజ్రాయుధము నెత్తి రఘువువక్షమునఁ బ్రయోగించెను. దానితో, రఘుసైన్యము గగ్గోలువడుచుండ నాదెబ్బకు రఘువునేలపై బఁడి తోడనె తెప్పరిలి దెబ్బను లెక్కచేయక లేచినిలచెను. రాజసైన్యమున మఱల హర్షనాదములు చెలరేగినవి. ఆ మహావీరుఁడు మఱల నింద్రునితోఁ దలపడ సంసిద్ధుఁడయ్యెను.

వజ్రహారమునుగూడఁ బాటింపక పగఁదీర్చుకొన నిలిచియున్న యా వీరవరుఁగాంచి శచీపతి యాతనిపోటరి తనంబునకు మిగుల మదిమెచ్చెను. పగతురనైనను సుగుణ వంతులను మదిమెచ్చుట సజ్జనలక్షణముగదా! ఇంద్రుఁ డిట్లనియె—"బళిరా, వీరవరా! కొండలనేనియుఁ బిండిసేయఁ జాలిన నా యమోఘమగు కులిశాయుధమును నీవుదక్క నితరుఁడింత వఱకెవ్వఁడు నోర్వలేకుండె. నీ యీ పోటరి తనంబునకు నేనెంతయుఁ బ్రీతుఁడనైతి. శూరాగ్రణీ! నీ కొక్కవరమీయ మనసగుచున్నది. నీ యశ్వమునుదక్క మఱెద్ది యడిగిన నడుగు మిచ్చెదము."

పాకశాసనుఁడిట్లు పలుకుటకుమున్నె యాతనిమచ్చ మాప నమ్మపైఁ గేలిడియున్న రఘువు, మంచిమాటలకుఁ దిగి దారికివచ్చు నింద్రుని మెత్తఁదనంబును గ్రహించి,

బంగరురంగుల నీను చుఱుకుటమ్మును బొదికిఁద్రోసి యనిమిష పతికిట్లనియె——

## ర ఘు వి జ య ము

"సురేశ్వరా! నాపై నీకనుగ్రహమా! అయినను నా తురంగమము నీయనొల్లవా? బాగుబాగు!! పిచ్చి కుదిరినది; రోకలి తలకుఁ జుట్టుమనినట్లున్నది నీమాట! సరియె. నా మాటవినుము. ఈ యాగపూర్తికై దీక్షగొని యున్న మాతండ్రికి నీయధ్వర సమాప్తిచేఁ గలుగవలసిన ఫలమునెల్ల ధారవోయుము. ఇంతియకాదు. మా తండ్రి కోపమున ఫాలాక్షతుల్యుఁడు. యాగహయమును గోల్పోయి రిక్తచేతులతో నాయనకడకేగుట నాచేతఁగానిపని. కనుక నీదూతలమూలముననె యీ వృత్తాంతమును మాజనకున కెఱిగింపుము." అను రఘుపలుకుల కలరి నాకపతి తథాస్తని తనదారిఁబట్టెను. రఘు వీరూపమున విజయి యయ్యును యాగాశ్వములేక తండ్రికడకేగవలసి వచ్చినందులకుఁ జిన్న బోయిన మొగముతో జనకునిఁ జేరసాగెను.

ఇంద్రదూత మూలమున మున్నుగనె రఘువిజయవార్త వినిన దిలీపరాజేంద్రుఁడు సంతుష్టుఁడై కొమరునిఁ దనదఱిఁ జేర్చుకొని వజ్రపుగాయముతో నిండిన పుత్త్రునిగాయమును తన చేత నిమురుచు నాతని బుజ్జగించెను. ఇట్లా దిలీపసార్వభౌముఁడు తన జీవితాంతమున స్వర్గమున కెక్కుటకై వేసికొనిన మెట్ల

వోలెఁ దొంబది తొమ్మిదశ్వమేధముల ముగించుకొని విషయ భోగములనుండి విరక్తుఁడై మహారాజ చిహ్నములనెల్లఁ దన సుతునకొప్పగించి, తాను ధర్మపత్నితోఁ దపోవనము కరిగి వానప్రస్థాశ్రమము స్వీకరించెను. ఇట్లు కొడుకులచే రాజ్యలక్ష్మీకరగ్రహణము చేయించి వార్ధకమున వానప్రస్థులగుట యిక్ష్వాకువంశజుల కులవ్రతము గదా!

ఇది వైదవ ప్రకరణము.

# షష్ఠ ప్రకరణము

## జైత్రయాత్ర

జనకునివలన రాజ్యాధిపత్యముఁ గైకొనిన రఘురాజ వహాళి, సాయంతనమున సూర్యతేజముంగొనిన వైశ్వానరుని భాతి భాసిల్లెను. తండ్రి యనంతరము రఘువు మహారాజయ్యె నని వినినతోడనె, యంతకుముందె దిలీపునిప్రతాపము నోర్వఁజాలక యీసు పొగలతో నిండియున్న సామంతరాజుల హృదయముల నొక్క పెట్టున భగ్గుమని విద్వేషాగ్ని ప్రజ్వరిల్లినట్లయ్యెను. కాని, మహాశూరుఁడును, ప్రజాభిమానమును జూఱఁగొనినవాఁడు నగు రఘువు పట్టాభిషిక్తుఁ డయినందులకుఁ బ్రజలెల్లరు నాతని నభినందించుచుఁ గడు ముదమందిరి. రఘు మహారాజుదండనీతి ప్రజలయాదరముఁ జూఱఁగొనెను. ప్రహ్లాదగుణముచేఁ జంద్రుఁడును, దపన గుణముచేఁ దపనుఁడును సార్థక నాములయినపగిదిఁ బ్రజా రంజన గుణముచే నీ మహారాజునెడ 'రాజ' నామము సార్థకమయ్యెను.

రఘుమహారాజు రాజ్యాధికారముంగైకొనిన పిదప వర్షఋతు వతిక్రమించెను. సురేంద్రుని మైదువన్నెల విల్లు మింటినుండి మాయమయ్యెను. నదులలోని మడ్డినీరు కలక దేఱి నిర్మలమయ్యెను. బాటలెల్ల బురదయెండి యాత్రాను

కూలములయ్యెను. ఇట్టి శరల్లక్షణములఁ గాంచి యా రాజేంద్రుఁడు జైత్రయాత్రాలోచనము తనమదిని సందడి సేయ దిగ్విజయయాత్రకై యేర్పాటులగావింప మంత్రివరుల కానతిచ్చెను.

మంత్రులు రాజాజ్ఞఁ దలఁదాల్చి యాత్రకై సకలమును సిద్ధపఱచిరి. శరత్కాలమున నశ్వములకెల్ల నీరాజనము సేయించుటా నాఁటి భూపతుల యాచరము. అగ్ని యేరూప ముననున్నను ప్రదక్షిణజ్వాలలతో వెలుఁగుట శుభశకున మందురు. పూర్వాచారము ననుసరించి మహారాజు రఘువు తనయశ్వములకెల్ల నీరాజనావిధినిఁ జేయింప నా నీరాజనాగ్ని ప్రదక్షిణవిధి నగ్నిజ్వాలలను వెలిగ్రక్కెను. అదియా మహా రాజునకు రానున్న విజయలక్ష్మిని సూచించుచున్నట్లుండెను.

ఇట్టి యాచారములనెల్ల పూర్తిగావించుకొని రఘు మహారాజు తన రాజధానికిని, దుర్గమునకునుఁ దగిన రక్షణ విధానముల నేర్పఱచింపఁజేసి షడ్విధ సైన్యంబుల వెంటఁగొని దిగ్విజయాభిలాషియై ప్రస్థానభేరిని మ్రోయింపఁజేసి బయ లొడలెను.

విజయలక్ష్మిని వరింపనేగుచున్న యా వీరరాజ శిరో మణిం గాంచు వేడుక పురజనముల మనముల సందడింపఁ జేసెను. వయోవృద్ధలగు ముత్తైదువలు మంగళాచారము ననుసరించి తమతమ సౌధముల యుప్పరిగల నిల్చి యా మహా రాజు మూర్ధమునఁ బేలాలు వాన గురియించిరి. నగర

యువతీబృంద మారతులు పట్టి విజయమంగళ గేయముల నాలపించిరి. వృద్ధవిప్రుల యాశీర్వాదఘోషము మిన్నుముట్టి నది. వందిమాగధులు విజయగేయములఁ బాడిరి.

ఈ చందమున సకలజనుల దీవనలం గొనుచు నా మహావీరుఁడు గాత్రము పులకింప మొదటఁ దూర్పుదిశ కేగెను. ఆ విజయయాత్రలో నరదముల పరుగులచే రేగిన ధూళి తోడను, గాలిమబ్బులఁ గేలునట్లున్న కరులతోడను నిండిన యా ప్రాంతభూమి యాకాశముగ మాఱినట్లుండెను. అట్టి యా వీరాగ్రగణ్యుని దండయాత్రను వినిన కొందఱు తూర్పు రాజులు గడగడలాడుచుఁ దమకుఁ దామె వచ్చి కానుక లర్పించి తమ ముప్పుఁ దప్పించుకొనిరి. మఱికొందఱు మూర్ఖ లగు రాజులు గర్వముచే నా వీరు నెదుర్కొని యూరుఁబేరు లేకుండఁ బోయిరి. ఆ మహారాజు కొన్ని దేశముల నసమర్థ పాలకులఁ దొలగించి తన యనుగ్రహమునకుఁ బాత్రులగు యోగ్యులను పాలకులుగ నియమించెను.

ఇట్లు ప్రాగ్దేశ రాజ్యములనెల్ల జయించి యటనుండి వంగదేశమును వశపఱచుకొనఁబోవ నచ్చటి రాజులును దమ తమ నౌకాబలములతో నా మహావీరు నెదుర్కొనిరి. ఆ మహావీరుఁడు వారినెల్ల నశ్రమమున నోడించి యచటి ద్వీప ములలోఁ దన జయస్తంభముల నాటించెను. రఘు బాణముల రుచి నెఱిఁగినపిదప నా వంగరాజులు తమ గర్వముల వీడి రఘు పాదముల నాశ్రయింప వారి నక్రమభావమున కలరి

మన్నించి మఱల మఱల నా యాస్థానములఁ బాలకులుగ నియమించెను. వంగదేశమునుండి కపిశానదిని దాటి యటనుండి యుత్కళరాజులు చూపిన త్రోవను గళింగమున నడుగు పెట్టెను.

## క ళిం గ వి జ య ము

కళింగాధిపతికి నేనుఁగుల దండు మెండు. ఆకావరముచే నాతఁడు రఘుమహారాజు నెదుర్కొని వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడినట్లు వెంటనె యా మహారాజునకుఁ బాదాక్రాంతుఁడయ్యెను. రఘురాజచంద్రుని సైనికులు విజయోల్లాసమునఁ జెలరేగి పానగోష్ఠి సేయనెంచి యచట తములపు బాకుఁ దోటలఁజేరి యా తములపుటాకుల నె దొప్పలుగఁజేసికొని నారికేళాసవమును మనసు దీఱఁబానము గావించిరి. అల్పబుద్ధులగు నితరరాజులవలెఁగాక యానృపాల మౌళి ధర్మప్రతిష్ఠాపనార్థమె యుద్ధముచేయువాఁడు గావునఁ దనకుఁ బాదాక్రాంతుఁడగు నా కళింగేశుని క్షమించి, ధర్మకార్యములకై యాతని సంపదనుమాత్రముగొని మఱల నాతని నా రాజ్యమునకు రాజుగఁ బ్రతిష్ఠించెను.

## ద క్షి ణ ది గ్వి జ య ము

కళింగమున విజయలక్ష్మిని జేపట్టిన యానరపతి పోకతోటల నలరారు నా సముద్రతీరముననె పయనించి యప్రయత్నముగనె జయములందుచు దక్షిణాభిముఖుఁ డయ్యెను.

సుదూరము కడచి కావేరినిదాటి తన సైన్యమును బరికింప నయ్యది మార్గాయాసముచే నలసియుండుటఁ దెలిసికొనెను. సేనలయలసట తీఱుటకై విడియఁదగిన ప్రదేశమునకై యన్వేషించుచుఁ బోవంబోవ నట మలయగిరిప్రాంత భూముల నెదిగియున్న మిరియాలపొలము లాతనిదృష్టి నాకర్షించెను. తోడనె సైన్యములు తమ తేని యనుమతి నా మిరియపుఁ దోటల విడిసినవి.

మలయగిరి రామణీయక మధ్బుతావహము. ఒక వైపున నేలకితోటలును, వేఱొక్కదిక్కున గంధపుఁదోటలును జూపఱదృష్టి నాకర్షింపఁ జాలియుండెను. ఆ నాఁడు దక్షిణదేశము పాండ్యవంశీయులగు నరపతుల పాలనమున నుండెడిది. పాండ్యులును మహాశూరులే కాని రఘుమహారాజు రాకకుముందె తమచారుల మూలమున వంగ, కళింగుల గతి వినియున్నవారగుటచే రఘుప్రతాపము నెదుర్కొన నోడి తాము గడించియుంచుకొనిన బహుసంపదలతో నా మహారాజును శరణుచొచ్చిరి.

పిదప నాచక్రవర్తి దక్షిణమునందలి మలయ, దర్దుర గిరి వరములఁగడచి, కేరళమును జయించి యచ్చటనరపతుల వలనఁ గరములగ్రహించి పిమ్మటఁ బశ్చిమ సముద్రతీర దేశముల నాక్రమించెను.

## పశ్చిమదిగ్విజయము

పశ్చిమమున మొదలుగ నావీరాధివీరుఁడు త్రికూటగిరి

శిఖరముపై జయ స్తంభమునునాటి తదుపరిఁ బారసీకముపై గన్ను వేసెను. సముద్రయాన మాకాలమున నిషిద్ధమగుటచే నా మహారాజు భూమార్గముననె పారసీకముపైఁదన యాత్ర సాగించెను.

పారసీకులకు యవనులనియుఁ బేరుగలదు. ఆ యవనులకు నశ్వదళమధికము. వారిసేనాంగములలో నదియే ప్రధానదళము. కావున నా పారసీకులు తమయశ్వదళముతో రఘుచక్రవర్తి నెదుర్కొని భీకర సమరముగావించిరి. దుస్సహ తేజోమూర్తియగు రఘునృపాలుఁ డుక్కురోసము మిక్కుటము కాఁగ నా యవనుల రణకండూతిఁ దీర్పఁబూని వారి శిరములను దనవాడిబల్లెముల కెఱగావించెను. మృతశేషులగు యవనులు పుచ్చకాయలవలె నెగురుచున్న తమవారి తలలఁ గాంచి వెఱపునొంది, బ్రదికియుండిన బలుసాకేఱుకొనవచ్చునని యెంచి తమతలపాగల నొలిచి యా మహారాజు పాదమూలముననుంచి శరణుచొచ్చిరి. శరణాగత రక్షకుడఁగు నా రఘు సార్వభౌముఁడు నా యవనుల ననుగ్రహించి విడిచిపుచ్చెను. అంతియెకదా! మహాత్ముల కోపము – అపరాధుల శరణాగతితో నడంగుఁగాదె! ఇట్లాయవనులు రఘువీరు నెదుర్కొని భంగపాటునొంది తలప్రాణము తోకకు వచ్చినట్లయి బ్రతుకుజీవుఁడాయని బయటపడిరి.

## ఉ త్త ర ది గ్వి జ య ము

ఇట్లు రఘు సార్వభౌముఁడు ప్రతీచీ దేశములనెల్ల

జయించి కడదిక్కుగు కౌబేరిదెసమఱలి తనయశ్వసైన్యముతో హిమగిరినెక్కి యటఁ దనవిజయపతాకము నెగురవేసెను. అట నానరపతిని గొండజాతులవార లెదుర్కొన నాయుభయ సైన్యములకు ఘోర యుద్ధముజరిగెను. అట్టి యాటవికులను దన శరప్రహారముల నొప్పించి పాదాక్రాంతులఁ గావించు కొనెను. హిమగిరియందట్లు విజయలక్ష్మిని జేపట్టి యా వీరా గ్రణి క్రమముగఁ గాంభోజము, కామరూపము, ప్రాగ్జ్యో తిషము (నేఁటి అస్సాము) నుగూడ జయించి, సహాయకులగు సకలరాజన్యులు వెంటనడువఁ దన రాజధానికి మఱలెను.

## విశ్వజిద్యాగము - సర్వస్వదానము

ప్రాచీనకాలమునఁ గొందఱుమహారాజులు 'విశ్వజిత్తు' అనుయజ్ఞము నాచరించువారు. సర్వసర్వం సహావిజేతలగు శూరాగ్రణులే యాయజ్ఞమునాచరించుట కర్హులు. అదియుఁ గాక గెలిచితెచ్చిన సకలసంపదలను గొంచెమేని మిగుల నీయక యాయాగమున దానము చేయువానికె యట్టియర్హత యుండెడిది. అట్టి సర్వస్వదక్షిణాకమగు నాయుత్తమాధ్వర మునుజరుపనెంచి యా యర్కకుల చక్రవర్తి యందులకు వలయు సన్నాహముల నొనర్చి యాగపరిపూర్తిగావించెను. సకల సామంత రాజమండలమా యధ్వరమున కాహ్వానింపఁ బడి కోసలరాజధానికేతెంచెను.

ఆ విశ్వజిద్యాగమున దానములఁ బడయుని యనాథులు

గాని, దీనులుగాని, వికలాంగులుగాని, విశ్వమున లేరనిన నతిశయోక్తికాదు. అందా మహారాజు తానుగెలిచి తెచ్చిన దానినేకాక తనకుఁ బితృధనముగ సంక్రమించిన యెల్లసంపదను బ్రీతితో లోకశ్రేయమునకై యర్పణముగావించెను. వేయేల? ఆ రాజేంద్రుని ధర్మపత్నికంఠమునఁ దాల్చిన మాంగల్య చిహ్నమును, జలపానమునకొక మృత్పాత్రమును మాత్రమె యా మహాత్యాగికి శేషించిన వనిన నాతని వదాన్యత యెట్టి దియొ యూహింపవచ్చును.

ఇట్లా విశ్వవిజేత విశ్వజిదధ్వరమును ముగించి విశ్వ దానము మూలమున నధికతరయశస్వియై యొప్పారెను. పిదపఁ దనకుఁ బాదాక్రాంతులై తనసైనిక నికాయమునఁ జేరియున్న రాజవర్గము నెల్లఁ దగురీతి గౌరవించి వారియప జయావమాన దుఃఖమునుదీర్చి స్వరాజ్యముల కఱుగ వారి ననుమతించెను. వారును జక్రవర్తియెడఁ దమ వినయభావ మును దెలుప ఛత్ర, కలశ, ధ్వజాదిరేఖల నొప్పారు నా నరపాలమౌళియడుగుఁ దమ్మ్ములఁదమ శిరములనుంచి నమస్కరించి తమ తమ యిరవుల కరిగిరి.

ఇది యాఱవ ప్రకరణము.

పూర్వఖండము సమాప్తము.

---

# ప్రథమ ప్రకరణము

## వరతంతు మహర్షి

ప్రాచీన కాలమున గురుకులములె విద్యాపీఠములై వెలయుచుండినవి. విద్వాంసుఁడగు గృహస్థుఁడుగాని, సన్న్యాసిగాని విద్యార్థులు కోరినంతనె విద్యాదానము కావించువారు. ఆనాఁటి విద్యార్థులకు గురుకులములే స్వకుటుంబములు. గురుదంపతులె తల్లిదండ్రులు. తోడి విద్యార్థులే సోదరబృందము. ఇంకఁ గేవల మేనాఁటి పాఠ మానాఁడు చెప్పి గెంటివేయు నాచార మానాఁటి గురువులకు లేదు. విద్యార్థుల భావి జీవితమున కవసరములగు నీతినియమములు, పరోపకారాది సద్గుణములు, జీవితధర్మములు, సంఘ నియమములు మున్నగునవి గఱపుచు విద్యాభ్యాసము ముగియునంత దనుకఁ దామె వారికిఁ దల్లిదండ్రులై కంటిని ఱెప్పలవోలెఁ గాచుచు, వారి యన్నపానాదుల సైతమేమఱక యరసికొనుచు విద్యార్థులను గన్నబిడ్డలవోలెఁ గాంచి పెంచుట యానాఁటి యుత్తమ గురువులకుఁ బరిపాటి.

మఱి యానాఁటి విద్యార్థులో! వారు గురుకులమునకుఁ జేరినదాది మఱి యింటిదెస మనసు నుంచరు. వారికి గురువే దైవము; గురుఁడే తల్లి; తండ్రియును. గురువునకుఁ బిమ్మటనే వారికిఁ దరువాతి లోకము. గురుద్రోహ మానాఁటి

పాపములలోనికెల్ల నెక్కుడు పాతకము. గురుని మనసునకుఁ జివుక్కుమనిపించిన విద్యార్థికి సద్గతిలేదని యానాఁటివారి నమ్మకము.

ఆనాఁటి శిష్యధర్మములలో గురుశుశ్రూష మొదటిది. గురుఁడును శిష్యుని సకలజీవనభారమును దానె వహించి తన విద్యనంతను శిష్యున కుపదేశించిననెకాని తన గురుధర్మముతీఱిన ట్లెంచువాఁడు కాఁడు. ఆహా! యానాఁటి యా గురుశిష్య సంప్రదాయములు, నా వాత్సల్యభక్తులు, నా యధ్యాపనాధ్యయన నిష్ఠలు నెంతటి మధురతరములో కదా!

ఉత్తర కోసలదేశమున భాగీరథీ తీరకాంతారమున నందాలగని యను నొక్క యాశ్రమమున 'వరతంతుమహర్షి' యను నొక్క ఋషీశ్వరుఁడు తపోనిష్ఠమెయి జీవితము గడపుచుండెను. ఆ మహానీయునికడ నెందఱో బ్రహ్మవాదులు వేదాంతవిజ్ఞానమును బడయుచు గురుశుశ్రూష చేయుచుండిరి. శాస్త్రాధ్యయనము సేయు బ్రహ్మచారిగణము లెక్కకు మిక్కిలిగ నందుండి యా మునివలన విజ్ఞానమును బడయుచుండెను.

ఆశ్రమప్రాంగణమునందలి విశాల తరుచ్ఛాయాతలములె వారికిఁ బఠనమందిరములు. అచ్చట స్వేచ్ఛగాఁబెఱిగి, మరకతరత్నకంబళము పఱచినపగిది శ్యామలమై, పట్టువితానీల మఱపించు బాలహరితగాసమె వారి కాసనాచ్ఛాదనము. నేఁటివలె నానాఁడు పాఠశాలాభవనములకై కాని,

ఆసనాస్తరణములకుఁగాని వేలు,లక్షల రూప్యములు వెచ్చించు నవసరము లేకుండెను. నాఁటి విద్యార్థులకు విశేషాంశములు వ్రాసికొను నలవాటులేదు. గురుఁడు గ్రంథాపేక్ష లేకయె వేదవేదాంగాదులనెల్ల పాఠము చెప్పఁగలఁడు. విద్యార్థులును జక్షురక్షరసంయోగము లేకయె గురుని బోధల నతిశ్రద్ధ నాలకించి తమ మదిని ధారణముచేయువారు. ఇట్టి యత్యద్భుత రీతిని మహర్షి వరతంతువు శిష్యగణము నేమరక యోరంత పొద్దును నధ్యాపనకార్యమునఁ బ్రొద్దుపుచ్చువాఁడు.

## కౌత్సుఁడు

వరతంతుముని యంతేవాసిగణమున మిగులఁ బ్రసిద్ధి చెందినవాఁడు కౌత్సముని. వయస్సునఁ ద్రిదశోపముఁడు; రూపమున జయంతసమానుఁడు; బుద్ధి కపబృహస్పతి; భక్తి, వినయముల కాతని కాతఁడె సాటియనుట సమంజసమగును. కౌత్సుఁడు తన పదునైదేండ్ల ప్రాయమున నిలువీడివచ్చి వరతంతుముని నాశ్రయించి విద్యాభ్యాసము నారంభించెను. ప్రారంభించిన పదునాలుఁగేండ్లకు విద్య ముగిసినది. చతుర్వేదములు; షడంగములు; మీమాంస; న్యాయము; ధర్మశాస్త్రము; పురాణములు నను పదునాలుఁగు విద్యల నా గురువరేణ్యుని బోధనమూలమున నా శిష్యరత్నమాపోశనము పట్టెను. ఇఁక గురుకులమునుండి యిలుసేర ననుమతి నీయఁదలఁచి వరతంతుమహర్షి శిష్యుని బిలచి యిట్లనియె—

## కౌత్స వరతంతు సంవాదము

వర : చిరంజీవీ! యింక నీకుఁ బిత్రునియుక్తమగు బ్రహ్మచర్యమును ముగింపఁదగిన కాలమాసన్నమయినది. తెలియునా?

కౌత్స: చిత్తము. బ్రహ్మచర్యము ముగించుటకు సమయ నియమముగూడఁ గలదా స్వామీ!

వర : మఱిలేదా! సకల వేద, శాస్త్రముల నధ్యయనము గావించి, బ్రహ్మతత్త్వమును గూర్చిన విషయపరిశోధన మేనాఁడు ముగియునో యానాటితో బ్రహ్మచర్యాశ్రమమున కవధి సమీపించెననియె తలఁపవలయును.

కౌత్స: మహాత్మా! ఇప్పటికిఁ దమదయచే నాకలవడిన బ్రహ్మజ్ఞానము శాస్త్రజ్ఞానరూపకమె కాని సాక్షాదనుభూతము కాదు గదా!

వర : వెఱ్ఱివాఁడా బ్రహ్మ పదార్థముయొక్క సాక్షాదనుభూతికి జీవితానుభవము, వయఃపరిణతియు ముఖ్యావశ్యకములు సుమా!

కౌత్స: భగవన్! ఆ జీవితానుభవమనునది యెట్టిపదార్థము? దానినెట్లో సాధించుట!

వర : అది మాటలతో లభించునది కాదు నాయనా! మానవుఁడు మోక్షమును పొందఁగల్గుటకై ప్రాచీనవిజ్ఞానులు కొన్ని త్రోవల నేర్పరచిరి. తదనుసారముగ మాన

వుని బాల్యావస్థను దీసివైచి కడమ వయః కాలమును నాలుఁగు ఘట్టములుగా నేర్పఱచిన యంశము నీకు బహుళముగ నేను తెల్పినదె కాని క్రొత్తది కాదుసుమా!

కౌత్స: అది సత్యమె. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసముల సంగతి తాము సెలవిచ్చుచున్నారని తలంతును.

వర : అగును. గురుశుశ్రూష; గురుబోధ; సదాచార పాలనము; శాస్త్రాధ్యయనము; యోగాభ్యాసను మున్నగు సాధన సంపత్తిచే జీవితమార్గమును కనుగొనుటయె బ్రహ్మచర్యాశ్రమముయొక్క ఉద్దేశము. సంసారపు జంజాటములు తగులకమునుపె మానవుఁడు నిరాటంకముగ విద్యావిజ్ఞానముల సాధించుటకె మహర్షులీ యాశ్రమమును నియమించిరి.

కౌత్స: అయిన నీయాశ్రమానంతరమున శిష్యుఁడు గురువు కడనుండు నవసరమే లేదందురా స్వామీ!

వర : అట్లేయనవచ్చును. ప్రతిమానవుఁడును విద్యావిజ్ఞానముల నార్జించుకొని సొంతపొట్ట నింపుకొనినంత మాత్రమున ఉత్తమజీవి యనిపించుకొనఁడు. పరోపకారము మానవధర్మములకెల్ల నుత్తమోత్తమము. ఆత్మోద్ధరణము మాత్రమెచాలదు. లోకోద్ధరణము గూడఁ జేయుట యావశ్యకము.

కౌత్సు: అది బ్రహ్మచర్యాశ్రమముచే సాధింప వీలుకాదా మహాత్మా?

వర: కాదు; కాదు. మానవుఁడు శ్రమ మెఱుఁగనిదె జీవితానుభవమును గడింపఁజాలఁడు. నాల్గు పురుషార్థములలోఁ గడపటిదగు మోక్షమును సాధించుటకుమున్న మానవుఁడు ధర్మ, అర్థ, కామములను మూఁడిటిని సాధింపవలయును. ధర్మ రహితమయిన ధనమును, ధర్మబాహ్యమయిన కామమును నిషిద్ధములు. ఇట్టి త్రివర్గమును సాధించిన మీఁదటనే మానవునకు మోక్షఫలములను గోరుట కర్హత లభించును. ఈ త్రివర్గము గృహస్థజీవనముననె సుసాధ్యము గాని యితరవిధములనిది యసాధ్యము. అదియుఁ గాక, భిక్షుకులు, సన్న్యాసులు మొదలగు వారికిని, కుంటి, గ్రుడ్డివారలగు వికలాంగులకును గృహమేధియె ఆధారము.

కౌత్సు: గృహస్థులు కానివారు మోక్షసాధనమున కనర్హులయినచో మఱి శ్రీ శుకాదుల సంగతి?

వర: అట్లడుగుము. లోకమున నెందఱు శ్రీశుకులను జూపఁ జాలుదువు? శ్రీ శుకుడు కేవలము కారణజన్ముఁడు. ఆతఁడు తన జ్ఞానాగ్నిచేఁ గర్మజాలమును దగ్ధమొనర్చిన పుణ్యాత్ముఁడు. పూర్వజన్మపుణ్య పరిపాకఫలమె యాతని జీవన్ముక్తునిఁ గావించినది. ఆ మహా

మహాలునకు నమోవాకములు.

కౌత్స: తండ్రీ! చీమలుప్రాఁకిన ఊళ్లగుననియు, దీయఁగఁ దీయఁగ రాగమబ్బుననియుఁ బెద్దల సుద్దిగదా! అట్లే మానవుఁడు నాజన్మాంతము బ్రహ్మచారిగనె యుండి గార్హ్యస్థ్యము నాచరింపకయె బ్రహ్మ సాధనమును చేయగూడదా?

వర: కుమారా! ధర్మము మిక్కిలి సూక్ష్మమైనది. సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడు గుణములతో నిండి నది ప్రకృతి. ఆ ప్రకృతిమూలమున జనించినవె దేహము, ఇంద్రియములును. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము నను నవి యాఱును మానవులకు శత్రులవంటివి. ఇవి యడుగడుగునకు బుద్ధిని భ్రమింపఁజేయుచుండును. ప్రకృతి గుణములన్నిటిలో కామము బలవత్తరమైనది. ఈ రహస్యమును గమనించియె మహాజ్ఞానులు ధర్మ కామములను ముడివైచి, తత్సాధనకై వివాహవిధిని నియమించి, జీవితధర్మములను నిర్వర్తించుటలో మాన వునికి ధర్మపత్నిని సహాయభూతురాలిని గావించినారు. ఇట్టి ధర్మపత్నియందు సంతానమును బడసి, వాంఛ లెల్లఁ దీరినవను నమ్మకము కలిగినవెనుక నా యాశ్ర మమును విడువవలయునని పెద్దల శాసనము. ఇందలి పరమరహస్యము నెఱుంగని మూర్ఖులు ప్రథమోత్సా

హము తో బాలసన్న్యాసులై, యౌవనవాంఛలు చెలరేగ నెన్నియో దురాచారములకుఁ బాల్పడి, సన్న్యాసినామముననె చాటు సంసారము నేర్పఱచు కొని దుష్కీర్తి పాలగుచుందురు. ఇది సర్వదా నిషిద్ధ మార్గము.

కౌత్స: తండ్రీ! నమోవాకములు. తమ యుపదేశమహిమ మున నా సంశయములు రూపుమాసినవి. దేవర యాజ్ఞ ననుసరించి జీవితమార్గమును సుగమము గావించుకొన నీ శిష్యపరమాణువు సర్వదా సంసిద్ధుఁడు.

వర : ధన్యుఁడవోయి కౌత్సకుమారా! ధన్యుఁడవు. నీ కుల వయశ్శీలముల కనుగుణవతియగు కన్యామణిని వరించి కృతకృత్యుఁడవగుము. వంశాభివృద్ధినిఁ గాంచుము. ఇదే మా యాశీస్సు. ఇంక నొక్క శుభదివసమునఁ గదలి మాతాపితరుల చరణసేవాభాగ్యము ననుభ వింప నిజగేహమున కరుగ సిద్ధముగనుండుము.

కౌత్స: గురుశేఖరా! యీ చిన్నవాని దొక్క మనవి. గురు దక్షిణ నర్పించుటనె శిష్యుని విద్య సఫలమగునందురు. శాశ్వతజ్ఞానకీర్తిసంధాయకమగు విద్యాసముద్రమును నాయందుఁ దరంగింపఁజేసిన గురుపాదుల ఋణము దీర్ప నసమర్థుఁడనె యగుదును. అయినను శిష్యధర్మ మున నన్నుఁ బదింబదిగఁ బ్రేరేచుట నడుగవలసి వచ్చినది. మహాత్మా! ఋణియగు నీయంతెవాసికి

గురుదక్షిణను విధించినచో సంతసమున నద్దానిని నెఱ వేర్పఁగలఁడు.

వర : వివేకీ! స్వచ్ఛమగు గురుభక్తియు ధర్మరక్తియును మాత్రమే సచ్ఛిష్యుని లక్షణములు. అవియె యాతఁడీఁదగు గురుదక్షిణలు. గురుఁడు పితృతుల్యుఁడు; శిష్యుఁడు పుత్త్రితుల్యుఁడు. కొడుకు తండ్రికి దక్షిణ నిచ్చుటయనిన లోకము నవ్విపోఁగలదు. ఇఁక నీ ప్రసంగమును జాలింపుము.

కౌత్స: మహాత్మా! అట్లుకాదు. గురుదక్షిణ నర్పింపక నేను పితృగేహమునకుఁ బోనొల్లను.

గురుదక్షిణ విషయమున నిట్లు గురుశిష్యులనడుమ వాదప్రతివాదములు చెలరేగినవి. తన గురుభక్తిని బ్రకటింపఁ దత్తరముతో శిష్యుఁడుండెను. విద్యాధనుఁడగు గురుం డితర ధనమునొల్లని యభిమానధనుండై యుండెను. గురుని నిషేధానునయములు హెచ్చినకొలఁదియు శిష్యుని పట్టుదలయుఁ బెరుగుచుండెను. ఈ తరుణమున గురుఁడు శిష్యుని పీడ భరింపఁజాలని స్థితికివచ్చెను. తా నిచ్చిన విద్యకుఁ బ్రతిగా దక్షిణగొనుట యాత్మహత్యాపాతకముతో సమానమని వరతంతుని నిశ్చయము. వలదనిన శిష్యుఁడు మానువాఁడుకాఁడు. ఇఁకనేమి గతి? ఏది యుపాయము? ఆచార్యుని యాలోచనాతరంగము లాకాశపథమునంటెను. ఆశిష్యవత్సలుని మానసమున నొక్కయుపాయము తటుక్కున పొడగట్టెను. "అసాధ్య

మగు నొక్క కోరిక కోరితినా, దానితోఁ గౌత్సుని మొగము వ్రేలఁబడునని మహర్షి యాశయము. తోడనె యాతఁ డిట్లనెను——

వర : వత్సా! నీ గురుకులవాస మెంతకాలమునుండి?

కౌత్సు: మొన్న ముగిసిన శ్రావణికిఁ బదునాల్గువర్షములు ముగిసినవి తండ్రీ!

వర : నావలన నీ వెన్నివిద్యల నార్జించితివి?

కౌత్సు: పదునాలుఁగు!

వర : అయిన వినుము: నీవు హృదయపూర్వకముగ గురుదక్షిణ నొసఁగఁదలఁతువేని పదునాల్గు విద్యలకుఁ బదునాలుఁగుకోట్ల సువర్ణములు నాకు దక్షిణ నొసంగుము. పొమ్ము. గురువాంఛితమును దీర్పని శిష్యునకుఁ గీడు మూడును సుమా!

కౌత్సు: తండ్రీ, ధన్యుఁడను. సచ్ఛిష్యుని గురుభక్తియే యసాధ్యమునుగూడ సుసాధ్యము గావింపఁగలదు. గురుని యాశీర్వాదబలమున్న నీ దక్షిణాద్రవ్య మసాధ్యముకాదు. నేఁడే సుదినము. గురుప్రసాదము లభించిననాఁటికంటె సుదినము వేఱొండుగలదే! దయామయా! యీ మీ శిష్యపరమాణువు నాశీర్వదింపుఁడు.

అని వినమ్రుఁడై, సాష్టాంగపాతముగ గురుచరణములకుఁ బ్రణమిల్లి, తదాశిషములఁబొంది, ద్రవ్యమును సాధింపఁ గౌత్సుఁడు బయలువెడలెను.

ఇది ఒకటవ ప్రకరణము.

---

# ద్వితీయ ప్రకరణము

## ధనార్జన యత్నము

కౌత్సున కిపుడు తలకుమించిన కార్యభారము పైఁబడినది. ఆయినూత్రైనా నూఱూత్రైనను, మిన్నువిఱిగి మీఁదఁబడినను గురుదక్షిణ తెచ్చి యర్పింపవలసినదే! కాని ఒక్కటా రెండా? పదునాలుగుకోట్ల సువర్ణములు!! ఎట్లు సంపాదించుట? ఒక సామాన్యుఁడు! కేవల విద్యాధనుఁడు!! గోచిపాత రాయఁడు!!! కౌత్సుడెక్కడ? పదునాల్గుకోట్ల సువర్ణము లెక్కడ? త్రోవపొడుగునను కౌత్సుని మెదడాలోచనా తరంగముల నుక్కిరిబిక్కిర య్యెను. శ్రమనెఱుంగని హృదయావేశముతో, ఆలోచనాభారముతో కౌత్సుఁడరణ్య మార్గముం గడచి జనపదముల త్రోవఁబట్టెను.

"గమ్యస్థానమేది? ఎవ్వఁడీ ధనమునిచ్చు నుదారుఁడు?" ఈ యూలోచనలతోఁ బ్రస్థానము సాగించుచున్న కౌత్సుని హృదయమున నొక్క యూహాతటిత్తు తళుక్కున మెఱసెను. హృదయశుద్ధిగల మహనీయులకు భగవంతుడు మార్గముం జూపుగాదె! రఘువు విశ్వవిజయముంగాంచి, విశ్వజిత్క్రతువు నాచరించుచున్నట్లు మున్నె వినియున్న వాఁడగుటచే నా యుదారుని నామము కౌత్సుని యుద్రిక్తహృదయమునఁ దోచెను. కాని యప్పటికె రఘుమహారాజు సర్వస్వత్యాగముఁ

గావించి రిక్తుఁడయ్యెనని యాతఁడెఱుఁగఁడుగదా! మహా రాజు నామస్మరణమునఁ గౌత్సుని హృదయకుసుమ మొక్కసారిగఁ బ్రఫుల్లమయ్యెను; ఆతఁడిట్లాలోచించెను—

"రఘువు సార్వభౌముఁడు; దానికితోడుగ మహౌదార్యము, దానికిబ్బడిగ విద్యాభిమానము, దానికి ముమ్మడుగుగ ఋషిధర్మ గౌరవము నా మహారాజున కుగ్గుబాలతో నలవడిన యుత్తమోత్తమ గుణములు. నా యీ మహోద్యమమును సఫలముగావించు నుత్తమవ్యక్తి మఱొక్కఁడు నభూతోనభవిష్యతి."

ఈ యాలోచన తోచినంతటనె కౌత్సుఁడు ద్విగుణీకృతోత్సాహమున నయోధ్యానగర మార్గముం బట్టెను. మితిలేని పట్టుదలతో నా యువకుఁడు గ్రామైక రాత్రముగఁ బయనము సాగించి యొక్కనాఁటి కయోధ్యానగరమునఁ బ్రవేశించి రాచనగరు సమీపించెను. ఆతని బ్రహ్మతేజము ప్రథశ్రమమును మఱుఁగువడఁ జేయుటచే నాతని మొగమున నలసటయె కాన్పింపకుండెను. ఆతఁడు తన రాజదర్శన వాంఛను ద్వారపాలకుల కెఱిఁగించెను. ఆకాలమున మహారాజులు సులభగమ్యులు. ఎవ్వారికేని రాజదర్శనము సులభసాధ్యము. మహారాజు తాను ప్రజాసేవకుఁడననియె తలఁచువాఁడగుటచేఁ దద్దర్శనాభిలాషుల కెల్లపుడును రాజదర్శనము కోరఁగనె లభించుచుండెడిది. ఒకద్వారపాలకుని మూలమునఁ గౌత్సుఁడుఁ తన యాగమనవార్తనుజెప్పి పుత్తెంచెను.

## రా జ ద ర్శ న ము

మహారాజతిథి సేవాధురంధరుఁడు. అందునను విన్నది వరతంతుశిష్యుని యాగమనముగూర్చి. కర్తవ్యముపట్ల నాలసించుటా మహారాజునకుఁ గిట్టనిపని. కావున నా ధర్మమూర్తి తనకు మిగిలిన మృత్పాత్రమందర్ఘ్య జలముఁగొని యతిథి నర్చింపనేగెను. ఆ మహారాజు కౌత్సమునిని యథావిధినర్చించి, పీఠమునం దధివసింపఁజేసి కరములు మోడ్చి యిట్లనియె——

రఘు : కుశాగ్రమతీ! సకలశిష్యగణమును దన జ్ఞానప్రకాశమున వెలిగింపఁజేయు మీ గురుప్రవరుఁడు వరతంతు ఋషికిఁ గుశలమా ?

కౌత్స: రాజా! నీ రాజ్యమున ధర్మము పరిపూర్ణమైయుండ మముఁబోంట్ల కుశలమునకుఁ గొఱంతయెట్టులు ?

రఘు : కుటిలమతియగు దేవనాథుఁడు మీగురుని తపోభంగమునకై యచ్చరలఁ బంపుటలేదుకదా ?

కౌత్స; అచ్చరలు వచ్చినను వారలమించు మచ్చెకంటు లేతెంచినను ధీరులచిత్తములు కలఁతనొందునా రాజా!

రఘు : సంతసము. మీ యిండ్లకేతెంచు నతిథులకును మీకును వలసినంత యాహారమును జేకూర్చు మీ నీవారసస్యములు గ్రామమృషభాదులవలని కీడునకు లోనుగాక వర్ధిల్లునా ?

కౌత్స: ఆహా! రఘురాజశేఖరుని ధర్మశాసనమును మనో

వాక్కాయముల నాదరించుచున్న రాజ్యప్రజలు తమ పశు సంతతిని జాగరూకతతోఁ గాపాడుకొనుచుండు టచే మానస్యముల కట్టియుపాయ మెన్నఁడును లేదు.

రఘు : నిండు మనసుతో మీకు సకలవిద్యలఁ గఱపిన గురువ రేణ్యునివలన మీకు గార్హస్థ్య స్వీకారమున కనుజ్ఞ లభించెనని తలఁపవచ్చునా ?

కౌత్స: రాజా! పరహృదయములఁ బసిపట్టఁజాలు నీ ప్రశ్న లెంతయు సముచితములు. విద్యలును బూర్తియయి నవి. అనంతరాశ్రమ స్వీకారమునకై గురుననుమతియు లభించినది. కాని—

రఘు : ఆఁ, కాని—యని సందేహమొందుటకు బాబూ! కేవలము తమ దర్శనమాత్రమున నాకుఁ దృప్తికలు గదు. గురునానతి నేతెంచినను, స్వార్థ కాంక్ష నేతెంచినను దమ కార్యమును బూర్తికావింపనిచో నాకుఁ దృప్తికలుగుటెట్లు? శంకింపక సెలవిండు.

ఇట్లా విశ్వదాత మహోదారముగఁ బలికినను దన కర్తవ్యమీయఁబడిన మట్టిముంతనుబట్టి రాజు సర్వస్వదానముచే శూన్యుఁడై యుండుటెఱింగి తన పని యూతనివలనఁ దీఱు నను నాశవీడి కౌత్సముని రాజున కిట్లనియె—

కౌత్స: రాజచంద్రా! అర్థిజనుల కోర్కులఁ దీర్చుటలో మీ కొలమువారికి సాటి యీ జగానఁ గానము. కాని...

రఘు : విప్రవరా! అతిశయోక్తులచే మము లజ్జింపఁజేయ

కుఁడు. మీ మనోరథమును ముందు సెలవిండు.

కౌత్స: కాలము మించినపిదప నిను యాచింపవచ్చినందులకుఁ బరితాపమగుచున్నది రాజా!

రఘు: మీ పరితాపమున కర్థము లేదు! రఘువుకడ కేతెంచిన పిదపఁ బరితాపపడువారలింతదనుకఁ గలుగరైరి! శంక మాని మీ కోర్కెఁ దెల్పిన నీ సేవకుఁడు దాని నీడేర్ప సిద్ధముగనున్నాఁడు.

కౌత్స: వదాన్యశిరోమణీ! నీ త్యాగము సుప్రసిద్ధము. సార్వ భౌముఁడవగు నీవు విశ్వదాన మొసంగియుండుట ముదావహము. శూన్యుఁడవయ్యును శోభాతిరేకమున వర్ధిలుట నీయందలి విశేషము. గురుధనముసకై నిను యాచింపవచ్చుటయె నా యీ రాకకుఁగల కారణము. సర్వస్వదానముఁ గావించియున్న నిన్నిపుడు యాచించుట మహాపచారము. కావున దీనిని మఱొక దాత నుండి పరిగ్రహింప యత్నింతును. చాతకము మేఘోదకమునకై యెదురుచూచునదైనను జలమునంతను వర్షించి శూన్యమైయున్న శరన్మేఘమును యాచింప నిచ్చగింపదు కాదె! రాజా! నీకు శ్రేయమగుఁగాక! సెలవిమ్ము! పోయివత్తును.

అని పలికి మగిడిపోనున్న వరతంతు శిష్యునింగాంచి యా విశ్వదాత యిట్లనియె—

రఘు: విద్వన్మణీ! ఆగుమాగుము! నీవు గురునకీఁదలఁచిన

వస్తువేద్ది? అది యేపాటిది? సెలవిమ్ము.

మహారాజు మఱిమఱి యడిగినపుడు దులబరించుకొని పోవుట మోటఱికు తనమని భావించి యాకౌత్సుఁడు కొంచె మాగి తనకును, గురునికిజరిగిని యెల్ల సంభాషణమును మహా రాజునకుఁదెల్పెను. మఱల నా యిరువురకిట్లు సంభాషణము మొదలయ్యెను—

కౌత్సు: భూనాథా! నీవర్ఘ్యమిచ్చిన మృత్పాత్రమె నీస్థితిని ఘోషించుచున్నది. ఇపుడు నీవు సార్వభౌముఁడవను బిరుదముచేమాత్రమె శోభిలుచున్నాఁడవని యెఱుఁగు దును. నాకు వలసిన గురుధనము మిక్కిలి యధికము. కావున నిను మొగమోటమి నిఱికించుట నా కధర్మము.

రఘు : ఓహూ! పండితుఁడా! అర్థియై రఘువు కడ కేతెంచిన వారలింతకు మున్నెన్నఁడును రిత్తవోయినదిలేదు. అట్టియెడ 'ఒకమహాపండితుఁడు రఘువును యాచించి హతమనోరథుఁడై తిరిగిపోయె 'నను క్రొత్తనింద నొక దానిని నా నెత్తినెక్కింపకుము.

కౌత్సు: అయిననిపుడు రఘుసార్వభౌముల యాదేశమేమని?

రఘు : సజ్జనాగ్రణీ! నీవు మాకుఁ బరమ పూజ్యుఁడవు! త్రేతాగ్నులతో విలసిల్లు నాయగ్నిశాలలో రెండు మూఁడు దినములుంటివా, నీకువలసిన ధనమునెల్ల నే సాధించియిత్తును.

చక్రవర్తి సత్యసంధుఁడని కౌత్సుని విశ్వాసము. కావున

నాతఁడా వదాన్యుని విన్నపమునకుఁ దలయొగ్గి నిలిచిపోయెను. సార్వభౌముఁడును దానంతకుమున్నె పుడమినెల్ల కొల్లఁగొట్టి నందున నింకభూలోకయాత్ర వ్యర్థమనియెంచి కౌత్సునికై తేఁదలఁచిన యాభూరివిత్తమును నవనిధీశ్వరుఁడగు కుబేరుని వలన రాఁబట్ట మనమున నిశ్చయించుకొనెను.

ఇది రెండవ ప్రకరణము.



# తృతీయ ప్రకరణము

## కుబేరునిపై యుద్ధప్రస్థానయత్నము

నాఁడు కడచినది. తెల్లవారినది. కుబేరునిపై దండయాత్రకుఁ దగిన సుముహూర్తమును పూజ్యవసిష్ఠులు నిర్ణయించిరి. నాఁటి ప్రాతఃకాలమునఁ బ్రయాణలగ్నము నిశ్చయింపఁబడినది.

వసిష్ఠమహర్షి మంత్రోదకప్రభావమున రఘుచక్రవర్తి రథమున కాకాశ, సముద్ర, మహీధరములపై సయితము పయనించు శక్తి యీవఱకే కలదు. అట్టి పునీతమగు నరదమున నస్త్రశస్త్రాదుల నమరింపఁజేసి యా వీరవరుఁడు గోధూళికాలగ్నమున నందు శయనించెను. కుబేరునిపైఁ దాను సాగింపనున్న దండయాత్ర నొక సామంతరాజుపైఁ జేయుదానినిగానే యా విక్రమశాలి భావించెను.

ఆ రాత్రియెల్ల రథమే రాజునకు శయనాగారమైనది. ఆ మహావీరుఁడు కన్నుమూసినఁ గుబేర యుద్ధకలాపమే స్వప్నగతమై గోచరింపసాగెను. తన ప్రతాపమునకు వెఱచి కుబేరుఁడు యుద్ధములేకయె లొంగినట్లును, దనకుఁ గానుకలిచ్చి సంధిచేసికొనినట్లు నా వీరాధివీరుఁడు కలలు గనసాగెను.

## కనకవర్షము

ఆహా! మహానుభావుల కలలు కల్లలుకావు కాబోలు!

రాత్రి మూఁడుజాములు నిట్టి కలలతోఁ గడచినవి. నాలవ జామది. యానాఁడెంత మంచిదియో కదా! అలవాటుచొప్పున నా మహారాజు నాలవజామున మేల్కాంచి రథమును సాగింప నిచ్ఛగించు నవసరమున నాతని కోశగృహాధికారులగు నధికృతులు సవిస్మయులై పరుగుపరుగున నేతెంచి విప్పారిన మోములతో రాజున కెదిరేఁగి యిట్లు విన్నవించిరి—

"మహాప్రభూ! జయము, జయము!! నేఁడొక వింత విషయము ఘటిల్లినది. విశ్వజిద్యాగ దానములచే నొట్టిపోయిన మన కోశాగారములు హఠాత్తుగా నిపుడిపుడె యాకసమునుండి కురిసిన బంగరువానచే క్రిక్కిరిసిపోయినవి. ఇపుడు ధనగృహములం దెటుచూచినను రత్న, హేమములు కుప్పలు తిప్పలుగ నున్నవి. ఇఁక దేవరయె ప్రమాణము."

ఇట్లు విన్నవించిన యధికృతుల పలుకుల కలరి యా విశ్వవిజేత తోడనె రథావతరణంబు గావించి కాల్యకృత్యంబులఁ దీర్చుకొని శుచియై యగ్నిగృహంబున కరిగి యటనున్న యతిథిశేఖరుఁడగు కౌత్సునికిని, త్రేతాగ్నులకును బ్రణమిల్లి కౌత్సుని వెంటనిడుకొని కోశగృహంబున కరిగెను.

అటఁ గోశగృహభాగంబులెల్ల రత్నప్రభలతోడను, హేమద్యుతులతోడను కనుల మిఱుమిట్లుగొల్పుచుండెను. అపారమగు నా భాసుర మణిహేమరాసులంగాంచి యక్కజంపడు నా యతిథి పెరలమూలమున నప్పటి విచిత్రవృత్తము నాలకించి రఘుమహారాజు శౌర్యసాహసములను లోలోన

మిక్కిలి మెచ్చుకొనెను. పిమ్మట నా రఘుకౌత్సుల కీరితిఁ బ్రసంగము సాగెను.

## వి వా ద ము

రఘు : పండితమండనా! మీ మా గురువుల యాశీఃప్రభావమున మన యిరువురి యాశయములు ఫలించినవి. తమకై సాధింపఁబడిన యీ యర్థమును స్వీకరించి నను ధన్యునిఁ గావింపుఁడు.

కౌత్స: రాజకులభూషణా! నీ వితరణ మీవఱకె విశ్వవిఖ్యాతము. నీబోటి మహావదాన్యుఁడగు పాలకుఁడు కలుగుకతన దేశము సుభిక్షమై యలరారుచున్నది. కాని—

రఘు : ఆఁ! కాని—? సందేహమేల, సెలవిండు!

కౌత్స: నా గురుఁడు ననుఁ గోరినది పదునాలుఁగుకోట్ల సువర్ణములు మాత్రము. నేను నిర్ణయించినదియు నంతియె కదా! అట్టియెడ నీ ధనరాశినెల్ల ననుఁ గొనిపొమ్మను టేటిధర్మము? నిను నేఁ గోరినంతయె కాని యెక్కుడు ధనము నేనొల్లను.

రఘు : ఓహో! నిష్కపటీ! అదేటి మాట! ఈ ధనార్జన వ్యావసాయము నీకై జరిగినదె కాని మదర్థము కాదు. నీకై యన్యు లిచ్చినదానిని నేనెట్లు ముట్టుదును? ఇదియెల్ల నీవ కొంపోవవలయును.

కౌత్స: వితరణగుణ ధురంధరా! ఇదియెల్ల నా కనవసరము. మున్ను కోరినదానికంటె నెక్కుడుగ నా గురుఁడును

స్వీకరించువాఁడు కాఁడు. కావున నా కోరినంతయె నా కిచ్చిపంపుము.

ఇట్లు దాతృప్రతిగ్రహీత లిరువురును వివదించుకొను నవసరమున రాజగురువగు వసిష్ఠమహర్షి యటకేతెంచెను. ఆ యిరువురి వివాదము నాలించి యా బ్రహ్మర్షిచంద్రుఁ డిట్లనియె—

## తీర్పు

"కౌత్సకుమారా! ఇక్ష్వాకు వంశజులు దాతలే కాని ప్రతిగ్రహీత లెన్నటికిని కారు. కకుత్స్థవంశజుల ధర్మపాలనము లోకవిశ్రుతము. వారి ధర్మరక్తికి రత్నగర్భయగు ధరామాత సదా ముదమంది రాజ్యపాలనమునకై వలయు సంపదల కెన్నటికిని లోటురానీయక ధనముల నీనుచుండును. నేఁడు సర్వస్వదానముచే రాజురిక్తుఁడై యుండుటను దలంచి, కుబేరదత్తమగు దానిలోఁ గొంత రాజునకు దక్కించఁదలంచుట నీ యుచితజ్ఞతకుఁదగిన తార్కాణమే యగును. కాని నేనింతకు ముందు వచించినట్లు మా రాజు దాతయే కాని 'ప్రతిగ్రహీత' యను వాదునకుఁ దలయొగ్గనొల్లఁడు. కావున మఱుమాటాడక యీ దానమును బ్రతిగ్రహించుటయె నీకుఁ బరమ ధర్మము." అనవుడుఁ కౌత్సుడు పరమానందమంది యిట్లనియె—

"మహర్షీ! మీ నిర్ణయ మనుల్లంఘ్యము. ఒకవైపున రాజశాసనము; మఱొకయెడ ఋషిరాజు నాదేశము. ఇట్టి

పట్టిన నేనెట్టులు దీనిఁదప్పించుకొనఁగలను?" అని పలికి రాజు దిక్కుగనుంగొని—

## అ భి న ం ద న ము — ఆ శీ ర్వా ద ము

"సార్వభౌమా! ధన్యుఁడను! నీధర్మర క్తియే నన్నాచార్య ఋణమునుండి ముక్తునిఁ గావించినది. ఇక నా ప్రయాణమున కనుమతింపుము." అనిన కౌత్సుని పలుకుల కలరి రఘుచక్రవర్తి తనభటులచే నూర్లకొలఁది గుఱ్ఱములను, లొట్టియలను దెప్పించి యా హేమరాశి నెల్ల సంచులఁగట్టించి వాటిపై నెక్కించి కౌత్సునకుఁ బ్రణమిల్లి, వినమ్రుఁడై, నిలిచి యుండెను. అంతకౌత్సుఁడు మహారాజు నభినందించువాఁడై యిట్లనియె—"వదాన్యరత్నమా! ప్రజల కధీశ్వరుఁడవు నీవు! న్యాయముగ సంపాదించుట, ఆర్జించిన దాని నభివృద్ధి గావించుట, పెంచిన దానిని రక్షించుట, కాచినదానిని యోగ్యులకిచ్చుటయునను నలుతెఱఁగుల రాజవర్తనమును నీవుతప్పక యున్నాఁడవు. అట్టి నీమనోరథమును భువియేకాక దివియును నీకిచ్చుటబ్బురమా! ఇట్టి శుభసమయమున నిన్నెట్లాశీర్వదింతునాయని యాలోచించుచున్నాఁడను.

"హస్తి, రథ, హయ, రాజ్యాదిసంపదలెల్ల నీ కిదివఱకె యబ్బియున్నవి. కావున నివియె నీకు మఱలఁ గలుగువలయుననుట నిష్ప్రయోజనము. సర్వసంపన్నుఁడవగు నీకింకొక్కటిమాత్రము వాంఛింపఁదగినది కలదు. అది సుపుత్రావాప్తి. కావున సుగుణశాలివగు నిన్ను నీ తండ్రి పుత్త్రినిగాఁ బడసినట్టులె నీవును నీ కనురూపుఁడగు సుగుణాకరునిఁ బుత్త్రినిగాఁ బడయుము. విశ్వపాలన సమర్థమగు నీ కోశమునెల్ల

సకల యాచకులకును, నాకును దానముగావించిన మహాదాత వగు నీకు 'విశ్వదాత' యను బిరుద మాచంద్రతారార్కమై యలరుఁగాత! భావికాలమున నీ వంశమువారగు పాలకులెల్ల రును నీ కీర్తిని సుప్రతిష్ఠితము గావించువారలై న్యాయ్య పాలనము నెఱపుదురు గాక!

"సకల గోసంతతికిని బ్రజాళికిని శుభమగుఁగాక! నీపాల నమున లోకులు సుఖులుగను, పృథివి సస్యప్రపూర్ణయును, దేశము క్షోభరహితమును, అపుత్త్రికులు పుత్త్రివంతులు గను, పుత్త్రివంతులు మనుమల తాతలుగను, నిర్ధనులు ధన ప్రపూర్ణులుగనై శతంజీవులగుదురు గాక!" యని యాశీర్వ దించి, బ్రహర్షి వసిష్ఠునకుఁబ్రణమిల్లి యా మునీంద్రు నాశిష ములఁ గొని యా యొంటెలబారును వెంబడించిపోయెను.

అట్టియెడ నయోధ్యావాసులగు జనులెల్లరు నా విచిత్ర వ్యక్తుల వృత్తమునుగాంచి నివ్వెఱపడి వారి ననేకభంగులఁ గీర్తించిరి. ఇందు చిత్రమేమన, ఒకవంక గురునకై వలసిన దానికంటె నెక్కుడుగ నొల్లని ప్రతిగ్రహీత కౌత్సుఁడు; మఱి యొక్కదిక్కున యాచకుని వాంఛితమునకన్న మిన్నగ నిచ్చిన వదాన్యుఁడు రఘువు — ఇట్టి లోకోత్తరవ్యక్తులఁగని ప్రజలు పరమాశ్చర్యమగ్నులై యుండిరి. అట్టియెడ నటఁ గూడియున్న చూపఱుల నోళ్లనుండి "జయవిశ్వదాతా; జయ సార్వభౌమా" యను నినాదము లప్రయత్నముగ నుప్పతిల్లి, భూమ్యాకాశముల మాఱుమ్రోగించుటతో నెల్లరు గృహో న్ముఖులు కాఁజొచ్చిరి.

మంగళం మహత్

# మాదిరి ప్రశ్నలు

## పూర్వఖండము

### ప్రథమ ప్రకరణము

1. అయోధ్యానగరమును స్వభాషలో వర్ణింపుము.
2. దిలీపచక్రవర్తి యొక్క సుగుణములను గూర్చి విపులముగా వర్ణింపుము.
3. త్రివర్గమనగా నేమి? దానిని సాధించుటవలన మానవులకు లభించునదేమి?
4. త్రివర్గములను సాధించుట కనువగు ఆశ్రమములెన్ని? వాటి పేర్లెవ్వి? వాటిలో రెండవ యాశ్రమము యొక్క ప్రాముఖ్యమేమి?
5. దిలీపుని హృదయమున చిరకాలమునుండి నిలిచియున్న వాంఛితమెద్ది? దానిని నెఱవేర్చుకొనుట కా మహారాజు చేసినదేమి?

### ద్వితీయ ప్రకరణము

1. దిలీపదంపతుల వనయాత్రను స్వభాషలో వర్ణింపుము.
2. వసిష్ఠాశ్రమము చేరిన దిలీపచక్రవర్తి తన మనోరథమునుగూర్చి మహర్షి కేమని విన్నవించెను?
3. దిలీపుని సంతానహీనతకుఁ గల కారణమునుగూర్చి వసిష్ఠుడు వచించినదేమి? సంతానప్రాప్తి కాతఁడు చెప్పిన 'యుపాయ మేమి?
4. నందిని రూపమును స్వభాషలో వర్ణింపుము.
5. దిలీపునకు వసిష్ఠు లాదేశించిన వ్రతాచరణ విధానమెట్టిది?

### తృతీయ ప్రకరణము

1. దిలీపనరపతి 21 దినములును నందిని నెట్లు సేవించెను?
2. ఇరువదిరెండవ వ్రతదినమున దిలీపునకు కలిగిన యాపద యెట్టిది? దానినుండి యాతఁడెట్లు విముక్తుఁడు కాఁగలిగెను? లేదా నందిని దిలీపుని పరీక్షించుట కెట్టి పన్నుగడ పన్నెను?

3. అరణ్యములో సింహ, దిలీపులకు జరిగిన సంభాషణ సారమును సంవాదరూపమున స్వభాషలో వ్రాయుము.
4. మాయసింగముయొక్క వృత్తాంతమునుగూర్చి నందిని తెల్పినదేమి?
5. నందిని యనుగ్రహమున దిలీపునకుఁ గలిగిన ఫలితమెట్టిది?

## చతుర్థ ప్రకరణము

1. రఘుజననవేళ కన్పట్టిన శుభశకునములను పేర్కొనుము.
2. రఘు జన్మోత్సవమును వర్ణింపుము.
3. లోకమునఁ దల్లిదండ్రులకు, తమ పిల్లలకు పేరుపెట్టుటలో గలుగు బాధలెట్టివి?
4. దిలీపుఁడు తన సుతునకు 'రఘువు' అను పేరేల పెట్టెను?
5. విద్యాభ్యాసమునకు వలయు ధీగుణములెవ్వి? రఘువుయొక్క విద్యాభ్యాసమును గూర్చి వివరింపుము.

## పంచమ ప్రకరణము

1. ఇంద్రుఁడు రఘుని యశ్వము నేల దొంగిలించెను? దానిని రఘు వెట్లు కనుగొనఁగలిగెను?
2. ఇంద్ర, రఘువుల యుద్ధమునకు మున్ను వారిరువురకు జరిగిన సంభాషణమును సంవాదరూపమున స్వభాషలో వ్రాయుము.
3. ఇంద్ర రఘువుల యుద్ధమును స్వభాషలో సంగ్రహముగా వర్ణింపుము.
4. తన యశ్వమును ఇంద్రునకు విడిచియే తిరిగిపోయిన రఘువు విజయి యనఁదగునా? అయినచో నా యంశమును సకారణముగ సమర్థింపుము.
5. "పుత్రులచే లక్ష్మీకరగ్రహణము చేయించి వార్ధకమున వానప్రస్థులగుట యిక్ష్వాకుల కులవ్రతముగదా!" ఈ వాక్యార్థమును సందర్భ సహితముగ వివరింపుము.

## షష్ఠ ప్రకరణము

1. తండ్రివలన రాజ్యాధికారమును బొందిన రఘువెట్లు భాసిల్లెను?
2. దిగ్విజయయాత్రకు వెడలుటకు ముందు రఘుమహారాజు ఆచరించిన యాచారము లెట్టివి?
3. విజయయాత్రకు బయల్వెడలిన సందర్భమున నగరమున నాతనికి గలిగిన పురస్కారమెట్టిది?
4. రఘుమహారాజు ఏయే దేశముల జయించెను? ఆయా దేశముల నప్పుడు జరిగిన విశేషములెవ్వి?
5. "విశ్వజిద్యాగము"ను చేయుట కర్హు లెవ్వరు? రఘుమహారాజు కావించిన విశ్వజిద్యాగమును పూర్తిగా వర్ణింపుము.

# ఉత్తరఖండము

## ప్రథమ ప్రకరణము

1. పూర్వకాలమున విద్యాభ్యాసమెట్లు జరుగుచుండెడిది?
2. పూర్వము విద్యార్థులకు, గురువులకును పరస్పర మెట్టి సంబంధ ముండెడిది?
3. ఆనాటి శిష్యధర్మములలో ప్రధానమని విశ్వసింపఁబడు ధర్మ మెద్ది?
4. కౌత్సముని వృత్తాంతమును సంగ్రహముగా తెల్పుము.
5. గురుదక్షిణ విషయమున కౌత్స, వరతంతులకు జరిగిన వివాదమును వివరింపుము. (లేక, సంవాదరూపమున వ్రాయుము.)
6. తుదకు వరతంతువు కౌత్సున కెట్టి గురుదక్షిణను విధించెను? సకారణముగ అందలి మంచి, చెడ్డలను వివరింపుము.

## ద్వితీయ ప్రకరణము

1. దక్షిణాద్రవ్యమును సాధించుటకై కౌత్సుఁడు ఎవ్వరి నాశ్రయించెను? అప్పుడా యాశ్రయింపబడిన మహనీయుఁడెట్టి స్థితి యందుండెను?

2. కౌత్సుఁడు రఘువును చేరినపుడు వారిరువురకు జరిగిన సంభాషణ మును వివరింపుము.
3. రఘుమహారాజు కౌత్సున కీదలంచిన ద్రవ్యమునెట్లు సాధింపఁదలచెను?

## తృతీయ ప్రకరణము

1. రఘువుయొక్క కోశాగారము హఠాత్తుగా నిండుటకుఁ గారణమేమి?
2. దానము నిచ్చువిషయమునను, స్వీకరించువిషయమునను రఘు, కౌత్సుల కేమి కారణములచే నెట్టి వివాదము కలిగెను? దానిని ఎవ్వ రెట్లు తీర్చిరి?
3. రఘువునుండి దానమును స్వీకరించిన కౌత్సుఁడు రాజు నెట్లాశీర్వదించెను?
4. 'విశ్వదాత' యను బిరుదెవ్వరికిఁ గలిగెను? దాని యర్థమేమి?
5. ఈ గ్రంథములోని క్రిందివారి చరిత్రములనుండి నేర్చుకొనదగిన సుగుణము లెవ్వి? —

(1) దిలీపమహారాజు.
(2) వసిష్ఠ మహర్షి.
(3) సుదక్షిణాదేవి.
(4) రఘుమహారాజు.
(5) వరతంతు మహర్షి.
(6) కౌత్సుఁడు.